# ఖుర్ఆన్-హదీసులలో
# ఏది ముఖ్యము?







రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# ఖుర్‌ఆన్-హదీసు
# ఏది ముఖ్యము?


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, 97 వ గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)




త్రైత శకము-40 ప్రథమ ముద్రణ : జూలై-2018

ప్రతులు : 1000 వెల : **70/-**



www.thraithashakam.org

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

త్రైత శకం

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

www.thraithashakam.org

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము.
98) సుప్రసిద్ధి బోధ.
99) సిద్ధి బోధ.
100) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
101) రూపము మారిన గీత.
102) సున్న.
103) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

www.thraithashakam.org

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

www.thraithashakam.org

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.

www.thraithashakam.org

82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

www.thraithashakam.org



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ఖుర్‌ఆన్ - హదీసు ఏది ముఖ్యము?

అపార కరుణామయుడు, పరమ కృపాశీలుడు, అనంత శక్తి మయుడు, అపార యుక్తిమయుడు అయినటువంటి దేవున్ని, ఇస్లాములో అల్లాహ్ అనబడేటటువంటి దైవమును ప్రార్థిస్తూ, ఇప్పుడు ఇస్లాముకు సంబంధించిన దైవములో ఉండేటటువంటి ప్రత్యేకతను మీకు తెలియ జేయాలని అనుకుంటున్నాము. ఇస్లామ్ మతములో ప్రత్యేకించి ఒక గ్రంథము ఉంది. అది పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథము. ఆ పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథములో దేవునికి (అల్లాహ్‌కు) సంబంధించిన సంపూర్ణ సమాచారము తెలియజేయబడింది. దేవునికి సంబంధించిన సంపూర్ణ సమాచారము హిందూ మతములో భగవద్గీతయందు, క్రైస్తవ మతములో బైబిల్‌యందు, ఇస్లామ్ మతములో పవిత్ర ఖుర్‌ఆన్ యందు చెప్పబడి ఉండగా, ఈ మూడు మతస్థులు తమ తమ గ్రంథాలను గొప్పగా చెప్పుకుంటూ, అంటే ఒక మతానికి ఇంకొక మతానికి సంబంధము లేకుండా, మా మతములో ఉండే దేవుడు ప్రత్యేకమైనవాడు అనేటటువంటి భావము పెట్టుకొని, మాది ప్రత్యేకమైన మతము అని, మా దేవుడు ప్రత్యేకమైనటువంటివాడు అని అనుకుంటున్నారు. కానీ సర్వజగత్తును సృష్ఠించినటువంటివాడు ఒకే ఒక దేవుడు అనేటటువంటి విషయాన్ని మరచిపోయినారు.

కానీ ఇస్లామ్ మతములో కూడా సర్వమును సృష్ఠించినవాడు దేవుడే అని అంటారు. అదే విధముగా క్రైస్థవులలో కూడా సర్వమును సృష్ఠించినది దేవుడే అని అంటారు. హిందూమతములో కూడా సృష్ఠికర్త దేవుడే అని అంటారు. కానీ అక్కడేమో అందరినీ సృష్ఠించినటువంటి వాడు దేవుడే అని అంటూ, ప్రత్యేకముగా మమ్ములను సృష్ఠించిన దేవుడు వేరు, మిమ్ములను సృష్టించిన దేవుడు వేరు అనే భావము పెట్టుకోవడము చాలా పొరపాటు. ఈ రకముగా ఇప్పుడు మనలో ఉండే భావాలలో తేడా వచ్చి, అనేక రకాల

ద్వేషాలు పెంచుకొని, అలాగే మతద్వేషాలు పెంచుకొని ఒకరికొకరు హింసించుకొనే స్థితికి వచ్చారు. ఇది మంచి పద్ధతి కాదు. మీ దేవుడే మా దేవుడు, మా దేవుడే మీ దేవుడు అనే భావముతో మీరు, మేము ఒకటే అనే ఐక్యమత్యముతో మనమందరము దైవగ్రంథములో ఉండేటటువంటి విషయాలను మరొకరు తెలుసుకుంటూ, ఒక మతములో ఉండేటటువంటి సారాంశాన్ని ఇంకొక మతము వారు తెలుసుకుంటూ, సమైక్యముగా ఉంటూ దేవున్ని అందరూ తెలుసుకోవాలనే ఉద్దేశ్యముతో మేము ఈ రోజు ఎవరూ చేయలేనటువంటి పనిని చేస్తున్నాము. ఎవరూ చేయలేని పని అంటే ఏమీ లేదు, అందరూ ఎవరి మతాల గురించి వాళ్ళు చెప్పు కుంటుంటారు. అయితే ఇప్పుడు మేము హిందూ జ్ఞానమునే కాక క్రైస్థవ జ్ఞానమును, ఇస్లామ్ జ్ఞానమును గురించి కూడా చెప్పుతున్నాము. ఒక హిందువు ఇస్లామ్ మతము గురించి చెప్పడము ఏమిటి? అని అనుకోకూడదు. ఇందువు అంటే **'జ్ఞాని'** అని అర్థము. ఇందువు దేవునికి సంబంధించిన జ్ఞానమే చెప్పుతాడు, కాబట్టి దేనిలో అయినా దేవునికి సంబంధించిన జ్ఞానాన్ని చెప్పేదానికి ఏ ఇందువుకైనా హక్కు ఉంది. ఇస్లాము మతములో ఇది దేవునికి సంబంధించిన జ్ఞానము, సర్వమానవులకు చెప్పినటువంటి విషయము అని పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథములో దేవుడు చెప్పేటప్పుడు, సర్వమానవులకు అని చెప్పినప్పుడు అది మీకూ సంబంధమే, నాకు సంబంధమే, ప్రతి ముస్లీముకు సంబంధమే, ప్రతి హిందువుకూ సంబంధమే, ప్రతి క్రైస్తవునికి కూడా అందులోని జ్ఞానము సంబంధమే అవుతుంది. కాబట్టి ఎవరైనా మూడు దైవగ్రంథముల గురించి మాట్లాడే హక్కు అందరికీ ఉంది. అందరూ తెలుసుకొనే హక్కు ఉంది. తెలుసుకొన్న దానిని అందరూ బయటికి చెప్పుకునే హక్కు కూడా ఉంది. ఎవరు చెప్పినా

దేవుని గురించి చెప్పుకోవడమే, దేవుని పవిత్రతను గురించి చెప్పుకోవడమే అంత తప్ప ఇంకొకటి ఏమీ లేదు. కాబట్టి దేవుని పవిత్రతను మనము కొనియాడుతూ ఇప్పుడు ఇస్లామ్ మతములో ఉండేటటువంటి హెచ్చు తగ్గులు తెలియజేసుకొని, అందులో ఏవైనా పొరపాట్లు ఉంటే మనము సర్దుకొని, ఇంకా ముందుకు పోవాలనే ఉద్దేశ్యముతో మనము ఈ ప్రయత్నము చేస్తున్నాము.

ఇప్పుడు ఇస్లామ్ సోదరులు కొంతమంది, మా ఇస్లామ్ మతములో ప్రార్థన ఎక్కువగా ఉంది, దైవజ్ఞానము తక్కువగా ఉంది అని చెప్పారు. మేము ఏమి చెప్పాము అంటే ప్రార్థన ఉంది మరియు దైవజ్ఞానము ఉంది, రెండూ ఉన్నాయి అని చెప్పాము. వాళ్ళు మాకు ఖుర్ఆన్ జ్ఞానము తెలియడములేదు అని అంటే అందులోని వాక్యములు మీరు అర్థము చేసుకోనప్పుడు అవి మీకు తెలియడము లేదు, కానీ అర్థము చేసుకుంటే హిందుమతములో ఏదైతే ఉందో అదే ఇస్లామ్ మతములో ఉంది, ఇస్లాము మతములో ఏదైతే ఉందో అదే క్రైస్థవమతములో ఉంది, అన్ని మతములలో ఉండేది ఒకటే అని తెలుస్తుంది. మీకు అందించిన **"కలియుగము యుగాంతము ఎప్పటికీ కాదు"** అనే గ్రంథములో నేను ఒక మాట వ్రాసాను. అది ఏమనగా! ఒక తులము బంగారుతో మనము ఒక గొలుసును చేశాము. అట్లే అదే తులము బంగారుతో ఇంకొక గొలుసును చేసాము. రెండు గొలుసుల పరిమాణములో తేడా ఉండవచ్చు, కానీ తూకములో అంతా ఒకటే, పదార్థములో కూడా రెండు ఒకటే అని తెలుస్తుంది. ఒక తులములో ఒక బిళ్ళను చేసినప్పుడు, అంతే తులములో ఇంకొక బిళ్ళను కూడా తయారు చేసారు. ఆ విధముగా మూడు రకాలుగా మూడు బిళ్ళలు ఉన్నాయి, అయితే అవి వేరు వేరుగా కనిపిస్తున్నాయి. అంతమాత్రమున

అవి బంగారు కాదు అనుకోవద్దండి. అన్నిటిలో ఉండేది బంగారే, అన్నిటిలో ఉండేది కూడా ఒకటే తూకము గల బంగారే ఉంది, కాబట్టి ఏ దానిలోనూ వ్యత్యాసము లేదు అని కూడా తెలుస్తుంది. ఇప్పుడు నేను ఖుర్ఆన్ గురించి చెప్పితే, హిందుమతములో మేము ఏది అర్థము చేసుకోగల్గినామో, హిందుమతములో ఏ దేవుడు ఉన్నాడు అని చెప్పినామో, అదే దేవుడే ఇస్లామ్ మతములో కూడా ఉన్నాడు. ఇస్లామ్ మతములో ఉండే వాళ్ళు ప్రతి ఒక్కరు ముస్లీమ్ అని అంటున్నారు. ముస్లీమ్ అంటే దేవుని మీద విశ్వాసము కల్గిన వానిని మనము ముస్లీమ్ అని అంటున్నాము. అంటే దేవుని మీద దేవుని జ్ఞానము మీద ఆసక్తి గల్గిన వానిని ముస్లీమ్ అంటున్నాము.

దేవుని జ్ఞానము తెలుసుకున్నవాడు ఎవడు అయినా గానీ వానిని ఇందువు అనే చెప్పాలి. కాబట్టి ఇస్లామ్ మతములో ఉండే జ్ఞానాన్ని తెలుసుకున్న ఎవరయినా ఇందువులే! ఇస్లామ్ మతములో ఉండే జ్ఞానాన్ని అర్థము చేసుకున్నా గాని మనము ముస్లీమ్‌లమే. ముస్లీమ్ అన్నా, ఇందువు అన్నా ఈ రెండు ఒకటే అర్థముతో కూడుకొన్నవే గానీ, ముస్లీమ్ అంటే వేరు, ఇందువు అంటే వేరు అనేటటువంటి అర్థము ఏమీ లేదు. ఇందు అంటే జ్ఞాని, ముస్లీమ్ అన్నా కూడా దైవత్వమును తెలుసుకున్న జ్ఞాని అని అర్థము. ఇస్లాము మతములో ముస్లీమ్ అని పేరు పెట్టారు. హిందూ మతములో 'ఇందూ' అని పేరు పెట్టారు. పేర్లు వేరు వేరు అయినా గానీ అర్థము మాత్రము ఒక్కటే. ఇప్పుడు నేను ఇస్లామ్ మతములో ఉండేటటు వంటి జ్ఞానమును తెలుసుకున్నాను కాబట్టి నేను నిజమైన ముస్లీమ్‌నే. అదే హిందూ మతములో ఉండేటటువంటి జ్ఞానమును ఎవరన్నా తెలుసుకున్నా గానీ, ఏ ముస్లీమైనా గాని అతను నిజమైన హిందువే. కాని హిందువు అన్నా, ముస్లీమ్ అన్నా ఇద్దరూ ఒకటే జ్ఞానము కల్గినటువంటివాళ్ళే గానీ

వేరు వేరు కాదు అని అర్థము చేసుకోవాలి. వాళ్ళు వేరు, వీళ్ళు వేరు కాదు అనే భావముతో మనము దైవజ్ఞానమును అర్థము చేసుకోవాలి.

ఇప్పుడు పవిత్ర ఖురాన్ గ్రంథములో ఉండేటటువంటి విషయాన్ని మనము తెలుసుకొనేదానికి ప్రయత్నము చేస్తున్నాము. పవిత్ర ఖురాన్ గ్రంథము చాలా గొప్పది. అందులో చాలా పవిత్రమైన వాక్యములు ఉన్నాయి. ఆ వాక్యములను **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"**, **"అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు"** అని మేము గ్రంథ రూపములో వ్రాశాము. ఎందుకంటే ఇస్లామ్ మతములో ఖుర్ఆన్ గురించి చాలామంది చాలా వ్యాఖ్యానాలు చెప్పుకున్నాగానీ, ఖుర్ఆన్‌లో సంపూర్ణమైన జ్ఞానము మనకు అర్థము కాలేదు. అందువలన అర్థమయ్యే విధముగా మేము దానిని రెండు గ్రంథములరూపములో వ్రాశాము. ఇప్పుడు ఆ గ్రంథములో ఉన్నటువంటి వాక్యములు మనము చెప్పుకోవాల్సిన పని వచ్చింది. ఇప్పుడు పవిత్ర ఇస్లామ్ మతములో ఉన్నటువంటి కొన్ని సూత్రాలను మనము చెప్పుకుంటే, ఆ సూత్రాలన్నీ పవిత్ర ఖుర్ఆన్ గ్రంథములో ఉన్నాయి. ఆ ఖుర్ఆన్ గ్రంథములో ఉన్నటువంటి విషయాలను మనము పరిశీలించి చూస్తే, అందులో ప్రతీ ఒక్కటి దేవునికి సంబంధించిన విషయాలు తప్ప మరొకటి ఏవీ లేవు. అందువలన మనము ఒక్కొక్క వాక్యాన్ని తెలుసుకొని చూడవలసిన అవసరము ఎంతో ఉంది. ఆ విధముగా చూడగలిగితే, అంటే ప్రతి ఒక్కరు ఖుర్ఆన్ గ్రంథములోని వాక్యములు తెలుసుకోగలిగితే, దేవుని జ్ఞానము బాగా తెలుసుకుంటారు. ఇప్పుడు హిందువులను కూర్చోపెట్టి ముస్లీమ్ యొక్క మాటలు మాకు చెప్పడము సబబేనా అని మీరు అనుకుంటే అది పొరపాటు అవుతుంది. ఇది కూడా హిందువుల జ్ఞానమే అని మీరు ఎందుకు అనుకోకూడదు? హిందువుల

భగవద్గీతలో ఉండే జ్ఞానమే అని ఎందుకు మీరు అనుకోకూడదు? అలా అనుకోకుండా పోవడమే పెద్ద అజ్ఞానము. మేము వేరే జ్ఞానాన్ని బోధిస్తున్నామని వీళ్ళు (హిందువులు) చెప్పుతున్నారు. వీళ్ళు హిందూ మతములో గురువుగా ఉండి వేరే మతాన్ని ప్రచారము చేస్తున్నారు అని కొంతమంది మమ్ములను గురించి అన్నారు.

మేము ఆ విధముగా చెప్పలేదు, అందరూ ఒకటే అనే భావముతోనే చెప్పుతున్నాము. వేరే మతస్తులను ఎవరినీ హిందువులుగా మార్చలేదు. అట్లే హిందువులను ఇతర మతములోనికి మార్చలేదు. మీరంతా మతాలు పెట్టి, పార్టీలు పెట్టి బాంబులు వేయించుకుంటున్నారు, అమాయక ప్రజలను చంపుతున్నారు. మేము అలాగ చేయడము లేదు. మా దగ్గరికి వచ్చిన వాళ్ళంతా ఐక్యమత్యముగా మాలో కలసిపోతున్నారు. మాతో సోదర భావముతో, స్నేహ భావముతో మా దగ్గరకు వస్తున్నారు. మీ దగ్గరకు ఎవరూ రావడము లేదు చూడండి అని మేము చెప్పుతున్నాము. మా దగ్గరికి దేవుడు ఒకడే అనే భావముతో వస్తున్నారు. జ్ఞానము అనే బంధుత్వముతో వస్తున్నారు అంతతప్ప వేరే ద్వేష భావముతో రాలేదు. మీ దగ్గరకి మతద్వేషము పెట్టుకొని వస్తున్నారు, మీరు వేరు, మేము వేరు అని వస్తున్నారు, మీరు చిన్నగా చేస్తే, మేము పెద్దగా చేస్తాము అని మీరు చిన్న బాణము వేస్తే, మేము పెద్ద బాంబే వేస్తామని మీ మీద వేస్తున్నారు. అంటే మీరు మత ద్వేషాలు పెట్టి ఎక్కడో కూర్చున్నారు, అమాయక ప్రజలు చనిపోతున్నారు. ఇటువంటివి లేకుండా ఎక్కడా ఏ దురాగతాలు జరుగకుండా, అమాయక ప్రజలు చనిపోకుండా అందరూ సమానముగా ఉండాలి అంటే హిందువులను ముస్లీమ్‌లు అర్థము చేసుకోవాలి, అట్లే ముస్లీమ్‌లను హిందువులు అర్థము చేసుకోవాలి, ముస్లీమ్ హిందువు అంటే

www.thraithashakam.org

ఇద్దరూ ఒక్కటే అని అర్థము చేసుకోవాలి. ఆ విషయాలను తెలియజేసే దానికొరకే నేను ఇప్పుడు ఈ కార్యక్రమము పెట్టి మీకు జ్ఞానమును తెలుపడము జరుగుతుంది.

ఇప్పుడు ఈ కార్యక్రమము ముఖ్య ఉద్దేశ్యము ఏమి అంటే మా ముస్లీమ్ సోదరులు కొందరు **"ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ"** అనే ఒక సంఘాన్ని స్థాపించారు. వారు ఖుర్ఆన్ జ్ఞానము మాకు అర్థము కావడము లేదు అని అడిగారు. కావున పవిత్ర ఖుర్ఆన్ గ్రంథము నుండి జ్ఞానమును మేము ప్రజలకు తెలియజేయాలనుకున్నాము. ఈ విధముగా హిందువులకు గానీ, ముస్లీమ్‌లకు గానీ అందరికీ జ్ఞానమును తెలియ జేయాలని అనుకున్నాము. "ఖుర్ఆన్‌లో ఉన్నటువంటి చిక్కు విషయాలను ఎవరైనా మమ్మల్ని ప్రశ్నిస్తే, మేము జవాబు చెప్పలేని స్థితిలో ఉన్నాము" అని ముస్లీమ్‌లు అడిగిన దానివలన జ్ఞాన విషయములో మా చేతనైనంత సహాయము చేస్తామని వారికి చెప్పాము. ఇప్పుడు మేము అదే విధానాన్ని ఆచరిస్తూ, ఖుర్ఆన్‌కు సంబంధించిన జ్ఞాన అర్థాలతో చెప్పుచున్నాము. "ఎదురాడని జ్ఞానాన్ని దేవుడు అందిస్తానని" మీకు చెప్పినప్పుడు, ఎక్కడ ఏ ప్రశ్నా మిగలకూడదు, ఎవరు ఏ ప్రశ్న అడిగినా దానికి జవాబు చెప్పేటటు వంటి స్థోమతతో మనము ఉండాలి. అటువంటి స్థోమత మనకు ఉండాలి అంటే ఖుర్ఆన్ గ్రంథము నుండి సంపూర్ణమైన జ్ఞానము మనకు తెలిసి ఉండాలి. ప్రతి హిందువుకు, ప్రతి ముస్లీమ్‌కు ఖురాన్ గ్రంథములో ఉన్న పవిత్ర వాక్యముల గురించి అర్థాలన్నీ పూర్తిగా తెలిసి ఉండాలి. ఎవరయినా ఖుర్ఆన్‌లో ప్రశ్న అడిగితే దానికి జవాబు చెప్పలేని స్థితిలో చాలామంది ఉన్నారు. అటువంటి పరిస్థితి లేకుండా అందరూ సరియైన జవాబు చెప్పే విధముగా ఉండాలి అని మేము అంటున్నాము.

ఒకానొక రోజు ముహమ్మద్ ప్రవక్తగారు నిరక్ష్యరాస్యుడు, చదువు లేనటువంటివ్యక్తి అయినా గానీ, ఆయన ఈ రోజు ఏ శాస్త్రవేత్తా చెప్ప లేనటువంటి విధానాన్ని ఆ రోజు చెప్పగలిగినాడు. ఆయన పరమపదించి 1400 సంవత్సరములు అయినా గానీ, ఆయన ఆ రోజు చెప్పిన వాక్యాల యొక్క రహస్యాలను ఏ శాస్త్రవేత్తా ఈ రోజు కూడా కనుగొనలేకపోతున్నాడు. దాని గురించి చెప్పలేకపోతున్నాడు. అంటే అంత గొప్ప భావాలు, అంత గొప్ప రహస్యాలను తెలియజేసినట్టి ప్రవక్తగారు ఆ రోజు నిరక్ష్యరాస్యుడైనా ఆయన నోటి వెంట ఈ దైవ వాక్కులు బయటికి రావడము జరిగింది. ఆ వాక్యముల గురించి మనము ఇప్పుడు తెలుసుకోవడానికి ప్రయత్నము చేస్తున్నాము. అటువంటి వాక్యములు మనము గమనించగలిగితే అవి 114 అధ్యాయాలలో ఖుర్ఆన్ గ్రంథములో చెప్పబడి ఉన్నాయి. 114 అధ్యాయాలలో అనేక ఆయత్‌ల రూపములో దైవజ్ఞానము ఉన్నా ప్రతి వాక్యము మనము అర్థము చేసుకొని, ఇతరులకు కూడా అర్థమయ్యే విధముగా చెప్పుకుంటే ఖురాన్‌లో ఉండే గొప్పతనము మనకు తెలియ బడుతుంది. ఈ ఖురాన్ గొప్పతనాన్ని మనము తెలియజెప్పుకుంటూ పోతే, మన శక్తి చాలదు. ఎందుకంటే భగవద్గీతలో ఎంత సారాంశము ఉందో అంత సారాంశము ఖుర్ఆన్‌లో ఉంది. దేవుని గురించి మనము పూర్తిగా చెప్పలేము. ఎందుకంటే దేవుడు అందరికంటే గొప్పవాడు, అందరికంటే శక్తివంతుడు కాబట్టి ఆయన గురించి పూర్తిగా చెప్పే అర్హత మనకు ఎవరికీ లేదు. ఆయన గొప్పతనాన్ని పూర్తి చెప్పలేము. కానీ కొంత కొంత అయినా చెప్పుకోవడానికి మనము ప్రయత్నము చేస్తాము.

ఇప్పుడు ఈ ఖుర్ఆన్ గురించి ప్రజలలో ఎంతవరకు అవగాహన ఉంది అని చూస్తే, కేవలము 5 శాతము మాత్రమే అర్థమయిందని, మిగతా

www.thraithashakam.org

95 శాతము అర్థము కాలేదని తెలియుచున్నది. ముస్లీమ్‌లు వారి పెద్దలు చెప్పినట్లు వాళ్ళు ఆచరించడము తప్ప ఖుర్‌ఆన్‌లో పూర్తి సమాచారాన్ని వాళ్ళు స్వీకరించడము లేదు. సరే ఈ రోజు ఎక్కువ ఆచరణ కలిగిన వాళ్ళు ముస్లీమ్‌లే అని చెప్పవచ్చు. భక్తిమార్గములో ఎక్కువ ఆచరణ కల్గినటువంటి వాళ్ళు ముస్లీమ్‌లే అనే విషయాన్ని మేము చెప్పాము. ఆ లెక్కప్రకారము పోతే ఇస్లామ్ మతములో ఉండేవాళ్ళే ఎక్కువ ఆచరణ కల్గి ఉన్నా, వారి ఆచరణ హదీసు వాక్యముల మీద ఆధారపడి ఉంది, కానీ ఖురాన్ వాక్యముల మీద ఎక్కువ ఆధారపడిలేదు అని చెప్పుతున్నాము. హదీసులు అంటే ఏమిటో మనము **"కలియుగము"** గ్రంథములో వ్రాశాము. హిందూ సాంప్రదాయాలు ఎట్లు ఉన్నాయో అట్లే ముస్లీమ్‌లకు కూడా కొన్ని సాంప్రదాయాలు ఉన్నాయి. సాంప్రదాయాలలో హిందువులు కొన్నిటిని ఆచరిస్తున్నారు, కానీ అందరికీ పూర్తిగా తెలియవనే చెప్పాలి. అలాగే ఇస్లామ్ మతములో కూడా కొన్ని సాంప్రదాయాలు ఉన్నాయి, వాటినే 'హదీసులు' అంటారు. ఆ హదీసులను ఆచరిస్తున్నారు కానీ వాటి వివరము కూడా పూర్తిగా తెలియదు. కొన్ని సాంప్రదాయాలు హిందువులలో ఎట్లు వచ్చినాయి అంటే పురాణాల వలన, వేదాల వలన వచ్చినాయి. కానీ భగవద్గీత వలన సాంప్రదాయాలు ఏవీ రాలేదు. భగవద్గీతలో ఒకే ఒక జ్ఞానము తప్ప వేరేది ఏమీ లేదు. ప్రపంచములో జీవించే సాంప్రదాయాలు ఏవీ కూడా భగవద్గీతలో లేవు. ప్రపంచములో మనము ఏ విధముగా మాట్లాడాలి, ఏ పనులు చేయాలి, ఎలా ఉండాలి అనేటివన్నీ మనకు పురాణాల వలన, వేదాల వలన వచ్చాయి. ఒక ఆరాధనను మనము ఆచరించాలంటే, మనకు వేదాలు, యజ్ఞములు చెప్పడము వలన ఆ విధానాలే మనము ఆచరిస్తున్నాము. ఆ ఆచరణలే మనకు సాంప్రదాయములుగా ఉన్నాయి.

ఆ సాంప్రదాయములు హిందువులకు ప్రత్యేకముగా ఉన్నాయి. అలాగే ఇస్లామ్ మతములో వాళ్లకు ప్రత్యేకముగా ఉన్నాయి. అలాగే క్రైస్థవ మతములో కూడా ప్రత్యేకముగా ఉన్నాయి. ఈ సాంప్రదాయాల వలననే మనము వేరు వేరు మనుషులుగా ప్రవర్తిస్తున్నాము. వేరు వేరు మతాలుగా మనము చీలిపోయినాము. ఈ సాంప్రదాయములు వదలి కేవలము మూల గ్రంథములలో ఉండేటటువంటి జ్ఞానాన్ని చూస్తే, మనమంతా ఒకటే అని తెలుస్తుంది. ఏమాత్రము బేధాలు రావు. వేదాలు, పురాణములను వదలి భగవద్గీతను మనము చూస్తే, అదే విధముగా క్రైస్థవులలో కూడా నాలుగు సువార్తలను ఆధారము పెట్టుకొని చూస్తే, ఇంకా అదే విధముగానే ఇస్లామ్‌లో కూడా ఖుర్‌ఆన్‌నే ఆధారము పెట్టుకొని చూస్తే మనుషులు అంతా ఒక్కటే, మనుషులందరికి దేవుడు ఒక్కడే, ఏ విధమైన వ్యత్యాసములు లేవు అని మనకు తెలియబడుతుంది. ఆ విధమైన వ్యత్యాసములు లేకుండా ఉండే జ్ఞానాన్ని మనము తెలుసుకోవాలని ఇప్పుడు తెలియజెప్పుకొంటున్నాము.

ముఖ్యముగా ఇస్లామ్ మతములో ఉండే చిన్న చిన్న పొరపాట్లను, మనము గ్రహించుకోలేని వాక్యములను తీసుకొని వాటిని సరిదిద్దుకొని చూస్తే, సంపూర్ణమైన జ్ఞానమును మనము తెలుసుకోవచ్చు. ఖురాన్ గ్రంథము దాదాపు 1400 సంవత్సరముల పూర్వము ముహమ్మద్ ప్రవక్తగారు తెలియజేసారు. తరువాత అది పవిత్ర గ్రంథముగానే మనకు లెక్కించబడి నది. దాని తరువాత ఆయన ఉన్నప్పుడు ప్రార్థన నేర్పించాడు, కొన్ని పనులు నేర్పించాడు, మనిషికి మనిషికి సలామ్ చేసే విధానము కూడా ఆయన నేర్పించాడు. ఆ రోజే మంచి పద్ధతులు అన్నీ నేర్పించిపోయాడు. ఇస్లామ్ మతములో ఏవేవి అయితే మంచి పద్ధతులు ఉన్నాయో, ఆ మంచి పద్ధతులన్నీ ఆయన ఆ రోజు నేర్పించిపోవడము కూడా జరిగింది. తరువాత

కొంత కాలానికి ఆయన దేవుని దగ్గరకు పోవడము కూడా జరిగింది. దేవుని ఆజ్ఞ ప్రకారము ఆయన పరమపదించడము కూడా జరిగింది. తరువాత, కొంతకాలమునకు అంటే దాదాపు మనకు 120 సంవత్సరముల తరువాత ప్రవక్తగారి దగ్గర శిష్యునిగా ఉన్నటువంటి శిష్యుని యొక్క శిష్యుడు ఒకరు ఈ హదీసు గ్రంథములు వ్రాయడము జరిగింది. ప్రవక్తగారు ఈ విధముగా చెప్పేవాడు, ఆ చెప్పినటువంటి విషయాలు ఈ విధముగా ఉన్నాయి, మనలను ఈ విధముగా ప్రవర్తించమని చెప్పాడు. ఇవి ఈ విధముగా చేయమని చెప్పాడు అని హదీసు గ్రంథమును రాయడము జరిగింది. అంటే ఖురాన్ గ్రంథము వేరు, హదీసు గ్రంథము వేరు అని మనకు బాగా తెలిసిపోతుంది కదా! ఖుర్ఆన్ ముహమ్మద్ ప్రవక్తగారు చెప్పారు. హదీసు గ్రంథములను ఆయన తరువాత వచ్చినవారు 121 సంవత్సరముల తరువాత చెప్పారు. ఆ విధముగా 145, 149,168 సంవత్సరముల వరకు ఆరుగురు వ్యక్తులు ఆరు గ్రంథాలు వ్రాశారు. ప్రవక్త ఉన్న రోజు వీళ్ళులేరు కానీ ఆ రోజు ఉన్న వాళ్ళు ఇలా చెప్పారు అని వ్రాశారు. అవి ఇప్పుడు మనకు హదీసు గ్రంథములుగా నిలిచాయి. ఈ ఆరుగురేకాక మిగతా 35 మంది కూడా వ్రాయడము జరిగినది. వారి పేర్లు ఇలా కలవు.

1. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై)
2. ఇమామ్ ముహమ్మద్ బిన్ ఇస్మాయిల్ బుఖారీ (రహ్మాలై)
3. ఇమామ్ ముస్లిం బిన్ హజ్జాజ్ (రహ్మాలై)
4. ఇమామ్ అబూదావూద్ సులైమాన్ బిన్ అష్ అస్ (రహ్మాలై)
5. ఇమామ్ అబూ ఈసా ముహమ్మద్ బిన్ ఈసా తిర్మిజీ (రహ్మాలై)
6. ఇమామ్ అబూ అబ్దుర్రహ్మాన్ అహ్మద్ బిన్ షుఐబ్ నసాయి (రహ్మాలై)

7. ఇమామ్ ముహమ్మద్ బిన్ యజీద్ బిన్ మాజీ (రహ్మాలై)
8. ఇస్హాఖ్ బిన్ రాహ్వేహ్ (రహ్మాలై)
9. అహ్మద్ బిన్ ఇబ్రాహిం ఇస్మాయిలీ (రహ్మాలై)
10. అహ్మద్ బిన్ అమ్ర్ బజ్జార్ (రహ్మాలై)
11. అహ్మద్ బిన్ హుసైన్ బైహఖీ (రహ్మాలై)
12. అబూ హాతిం ముహమ్మద్ బిన్ ఇద్రీస్ రాజీ (రహ్మాలై)
13. అబ్దుల్లాహ్ బిన్ అలీబిన్ జౌరుజ్ (రహ్మాలై)
14. హారిస్ బిన్ అబూ ఉసామ (రహ్మాలై)
15. అబూ అబ్దుల్లాహ్ అల్ హాకిమ్ (రహ్మాలై)
16. అబూహీతిం ముహమ్మద్ బిన్ హిబ్బాన్ (రహ్మాలై)
17. ముహమ్మద్ బిన్ ఇస్హాఖ్ బిన్ ఖుజైమ (రహ్మాలై)
18. ఇబ్నె అబూ ఖైపమ (రహ్మాలై)
19. అలీ బిన్ ఉమర్ దారె ఖుత్నీ (రహ్మాలై)
20. ఇమామ్ దారిమీ (రహ్మాలై)
21. అబూదావూద్ తయాలిసీ (రహ్మాలై)
22. ఇబ్నె అబూ అద్దున్యా (రహ్మాలై)
23. ఇమామ్ జుహ్లీ (రహ్మాలై)
24. అబూ జుర్అ రాజీ (రహ్మాలై)
25. సయీద్ బిన్ మన్సూర్ (రహ్మాలై)
26. ఇబ్నె సకన్ (రహ్మాలై)
27. ముహమ్మద్ బిన్ ఇద్రీస్ షాఫయి (రహ్మాలై)
28. అబూబక్ర్ బిన్ అబూ షైబ (రహ్మాలై)
29. సులైమాన్ బిన్ అహ్మద్ (రహ్మాలై)
30. అహ్మద్ బిన్ ముహమ్మద్ తహావీ (రహ్మాలై)

www.thraithashakam.org

31. ఇబ్నె అబ్దుల్ బర్ర్ (రహ్మాలై)

32. అబ్దుల్ హాఖ్ (రహ్మాలై)

33. అబ్దుర్రజ్జాఖ్ హుమామ్ (రహ్మాలై)

34. అబ్దుల్లాహి బిన్ అదీ (రహ్మాలై)

35. ముహమ్మద్ బిన్ అమ్ర్ అఖీలీ (రహ్మాలై)

36. అలీ బిన్ మదీని (రహ్మాలై)

37. అలీ బిన్ ముహమ్మద్ ఇబ్నుల్ ఖత్తాన్ (రహ్మాలై)

38. ఇమామ్ మాలిక్ (రహ్మాలై)

39. ముహమ్మద్ బిన్ ఇస్హాఖ్ ఇబ్నె మంద (రహ్మాలై)

40. అబూ నూఐమ్ అస్ఫహానీ (రహ్మాలై)

41. అబూ యాల అహ్మద్ బిన్ అలీ (రహ్మాలై)

ఈ రకముగా వ్రాసిన తరువాత మరలా కొంతకాలానికి అనగా 200 సంవత్సరముల తరువాత ఇమామ్ బుఖారి గారు, దాదాపు 210 సంవత్సరాల తరువాత ఇమామ్ ముస్లీమ్ గారు ఒకటి హదీసు గ్రంథాలు వ్రాయడము జరిగింది. వాటిలో బాగా ప్రచారము పొందినది ఇమామ్ బుఖారి గారి గ్రంథమే బాగా ప్రసిద్ధి చెందింది. ఆయన బాగా జ్ఞాపక శక్తి గలవాడు. ఆయన చాలా మంచి తెలివైనవాడు. ఆ రోజు ప్రవక్తగారు ఇవే విషయాలు చెప్పాడు అని మనకు నీతి వాక్యములన్నీ వ్రాసిపెట్టడము జరిగింది. ఆ విధముగా వ్రాసిన వాక్యములు మొత్తము మనకు ఆరు లక్షలు ఉన్నాయి. అంటే మొట్టమొదట ఇమామ్ బుఖారి గారు వ్రాసిన హదీసు గ్రంథము ఏది అయితే ఉందో, అది ఆరు లక్షల హదీసు వాక్యములతో నిండుకొని ఉంది. కానీ అది అత్యంత ప్రామాణిక గ్రంథము అయినా గానీ వాటిలో నుండి సరిగా ఏర్పరిచి పెట్టినటువంటివి 7397

www.thraithashakam.org

వాక్యములు. ఆరు లక్షలలో నుండి ముఖ్యమైన 7397 వాక్యములను మాత్రమే బయటికి తీసారు. అంటే మిగతా వాటిని వదలివేయడము జరిగింది. వీటినన్నింటినీ తీసివేస్తూ, ఇంకా తీసివేస్తూ పోతే ఎక్కడా ఏ హదీసు వాక్యము కూడా ప్రవక్తగారి హోదాకు భంగము కల్గించకుండా ఉండేటటువంటి విధానముతో చూస్తూ అన్నీ కరెక్ట్‌గా ఉండేవాటిని ఏర్పరచుకుంటూ వస్తే చివరకు మిగిలినవి 2602 హదీసులు మాత్రమే మిగిలినాయి. అంటే 6 లక్షలు నుండి చివరకు ఎన్ని మిగిలినాయి అంటే 2602 హదీసులు మాత్రమే మిగిలినాయి. ఈ రకముగా ఆయన 16 సంవత్సరములు కష్టపడి హదీసు గ్రంథము వ్రాసిపోయాడు. ఆయన తరువాత అంటే కొద్దికాలము ఒక పది సంవత్సరములు గడచిన పిమ్మట పుట్టిన ఇమామ్ ముస్లీమ్ గారు కూడా హదీసు గ్రంథములు వ్రాయడము జరిగింది. ఆయన మొత్తము 4 లక్షల హదీసులను వ్రాశాడు. ఇమామ్ బుఖారి గారు 6 లక్షలు వ్రాస్తే, ఇమామ్ ముస్లీమ్ గారు 4 లక్షలు సేకరించాడు. అందులో ఇమామ్ ముస్లిము గారు ఇది బాగలేదు, అది బాగలేదు, ఇది ఎక్కడైనా మనకు జవాబు చెప్పలేని పరిస్థితి వస్తుంది, ఇది ప్రవక్త గారి బోధకు ప్రత్యక్షముగా భంగము కల్గుతుందనీ అని ఆ విధముగా తీసివేస్తూ, తీసివేస్తూ వస్తే ఆయనవి కూడా 7270 హదీసులు మాత్రమే మిగిలినాయి. ఈ విధముగా చివరకు వాటిలో కూడా ఇంకా వడగట్టితే 4000 హదీసులు మాత్రమే మిగిలినాయి. ఈ రకముగా 4000 హదీసులతో ఇమామ్ ముస్లీమ్‌గారు, 2602 హదీసులతో ఇమామ్ బుఖారి, గారు నిలిచారు. ఈ విధముగా మనకు హదీసులు అనేవి వ్రాయబడ్డాయి. ఖురాన్ వేరు, హదీసులు వేరు అని మీరు బాగా గ్రహించుకోవాలి. (ఇమామ్ బుఖారి, ఇమామ్ ముస్లీమ్ గారి విషయము "మహా ప్రవక్త హితోక్తులు" అను గ్రంథము నుండి సేకరించినది ఇక్కడ తెలుపుచున్నాము చూడండి.)

www.thraithashakam.org

## ఇమామ్ బుఖారీ (రహ్మాలై) :-

సహీమ్ బుఖారీ గ్రంథాన్ని సంకలనం చేసిన ఇమామ్ అబూ అబ్దుల్లా ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బిన్ ఇబ్రాహీమ్ అల్ బుఖారీ (రహ్మాలై) హిజ్రీ శకం 194, షవ్వాల్ మాసం 13వ తేదీ శుక్రవారం నాడు బుఖారాలో ఒక పేద కుటుంబంలో జన్మించారు. ఆయన పదేళ్ళ ప్రాయంలో విద్యాభ్యాసం ప్రారంభించారు. స్వగ్రామంలో ప్రాథమిక విద్యనభ్యసించిన తరువాత ఉన్నత విద్య కోసం ముస్లీం జగత్తులోని యావత్తు ప్రధాన విద్యా కేంద్రాలన్నీ పర్యటించారు. ఈ సుధీర్ఘ పర్యటనలో ఆయన 1080 మంది ధర్మవేత్తల నుండి హదీసు విద్య నేర్చుకున్నారు. పదేళ్ళ ప్రాయంలోనే ఆయన బుఖారాలో ఆనాటి హదీసు విద్యా పారంగతులు ఇమామ్ దాఖలీ (రహ్మాలై) గారి పాఠశాలలో చేరారు.

ఒకరోజు ఇమామ్ దాఖలీ (రహ్మాలై) ఒక హదీసు ప్రమాణాన్ని పేర్కొంటూ "సుఫ్యాన్ అన్ అబీజుబైర్ అన్ ఇబ్రాహీం" అని అన్నారు. అప్పుడు ఇమామ్ బుఖారీ (రహ్మాలై) కల్పించుకొని "ఈ హదీసు ప్రమాణం ఈ విధంగా లేదండీ! అబూజుబైర్ ఈ హదీసుని ఇబ్రాహీం నుండి ఉల్లేఖించలేదు" అని అన్నారు.

అతి పిన్న వయస్సులో ఉన్న ఒక శిష్యుడు తనను ఇలా తప్పబట్టడంతో గురువుగారు ఉలిక్కిపడ్డారు. ఆయన కోపంతో కొరకొరా చూశారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గురువుగారి పట్ల ఎంతో వినయ విధేయతలతో వ్యవహరిస్తూ "మీ దగ్గర అసలు గ్రంథం ఉంటే అందులో ఓసారి చూచుకోండి" అని ప్రశాంతంగా అన్నారు.

ఇమామ్ దాఖలీ (రహ్మాలై) ఇంటికి వెళ్ళి అసలు గ్రంథాన్ని పరిశీలించి ఇమామ్ బుఖారీ (రహ్మాలై) చేసిన విమర్శ సహేతుకమయినదేనని గ్రహించారు. ఆయన తిరిగి వచ్చి "అయితే సరయిన ప్రమాణం ఏమంటావు?" అని అడిగారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) తక్షణమే సమాధానమిస్తూ "సుఫ్యాన్ అనిజ్జుబైరి వహు

వన్‌బు అదియ్యి అన్ ఇబ్రహీం (ఇబ్రాహీం నుండి జుబైర్ బిన్ అదీ రహ్మాలై-ఉల్లేఖించారు; అబూబుబైర్ అనడం సరికాదు)" అని అన్నారు.

అప్పటికి ఇమామ్ బుఖారీ వయస్సు పదకొండేండ్లు కూడా నిండలేదు. పదహారు సంవత్సరాల వయస్సులో ఆయన హజ్రత్ అబ్దుల్లా బిన్ ముబారక్ (రహ్మాలై), ఇమామ్ వకీ (రహ్మాలై) లు సేకరించిన హదీసులన్నీ కంఠస్తం చేశారు. 18వ యేట చరిత్ర గ్రంథాన్ని రచించనారంభించారు, ఇందులో సహాబీలు (ప్రవక్త ప్రత్యక్ష అనుచరులు), తాబయీల (ఆ తరువాతి అనుచరుల) జీవిత చరిత్ర, వారు చెప్పిన మాటలు, చేసిన నిర్ణయాలన్నీ సమీకరించబడ్డాయి. ఈ గ్రంథాన్ని ఆయన దైవప్రవక్త (స) సమాధి దగ్గర కూర్చొని వెన్నెల రాత్రులలో వ్రాశారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) అసామాన్య జ్ఞాపకశక్తి గల మేథా సంపన్నులు. ఎంత పెద్ద హదీసయినా సరే ఒక్కసారి చదివితే లేక వింటే చాలు కంఠస్తమయి పోయేది.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గారి సమకాలిక హదీసువేత్త హామిద్ బిన్ ఇస్మాయిల్ ఇలా తెలియజేస్తున్నారు. "ఇమామ్ బుఖారీ బస్రాలో మాతో పాటు హదీసు తరగతులకు హాజరవుతూ ఉండేవారు. అయితే ఆయన కేవలం వినేవారు. ఒక్క అక్షరం కూడా వ్రాసుకునేవారు కాదు. ఈ విధంగా 16 రోజులు గడచి పోయాయి. చివరికి ఓ రోజు నేను, హదీసులు వ్రాసుకోకపోవడం పట్ల ఆయన్ని విమర్శించాను. దానికాయన సమాధానమిస్తూ " ఈ పదహారు రోజుల కాలంలో నీవు వ్రాసుకున్న విషయాలన్నీ తీసుకురా. వాటన్నిటినీ నేను చూడకుండా చదువుతాను విను" అని అన్నారు. ఆ విధంగా ఆయన పదిహేను వందలకు పైగా హదీసుల్ని ఒక్కపొల్లు పోకుండా ఉన్నది ఉన్నట్లు మాకు వినిపించారు. స్వయంగా మేము అనేకచోట్ల మా వ్రాతల్లో దొర్లిన తప్పలను ఆయన నోట విని సవరించుకోవలసి వచ్చింది."

www.thraithashakam.org

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గారి జ్ఞాపకశక్తి గాథలు దశ దిశలా వ్యాపించి పోయాయి. ఆయన ఏ ప్రాంతానికి బయలుదేరినా, ఆయనకు ముందే ఆ ప్రాంతానికి ఆయన పేరు ప్రఖ్యాతులు చేరుకునేవి. ప్రజలు వివిధ రకాలుగా ఆయన జ్ఞాపకశక్తిని పరీక్షించేవారు. చివరికి వారు ఆయన అసాధారణ జ్ఞాపకశక్తికి ఆశ్చర్యచకితులయి ఎంతో అభినందించే వారు. ఆ కాలములోనే షేఖ్ అబూజరఆ (రహ్మాలై), అబూ హాతిం (రహ్మాలై), ముహమ్మద్ బిన నస్ర్ (రహ్మాలై), ఇబ్ను ఖుజైమా (రహ్మాలై), ఇమామ్ తిర్మిజి (రహ్మాలై), ఇమామ్ ముస్లిమం (రహ్మాలై) లు ఆయనకు శిష్యులయిపోయారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ని ప్రశంసిస్తూ కొందరు ప్రముఖులు వెలిబుచ్చిన అభిప్రాయాలు వినండి :

"బుఖారీ (రహ్మాలై) హదీసు విద్యలో నాకంటే ఎక్కువ వివేకం, దూరదృష్టి కల వ్యక్తి. ఆయన దైవదాసుల్లోకెల్లా ఎక్కువ వివేచనాపరుడు. నిజం చెప్పాలంటే బుఖారీని మించిన వారే లేరు."

- ఇమామ్ దారిమి (రహ్మాలై)

"ఖురాసాన్ భూభాగంలో ఇమామ్ బుఖారీ (రహ్మాలై) లాంటి మహోన్నత వ్యక్తి మరొకరు జన్మించలేదు."

- ఇమామ్ అహ్మద్ (రహ్మాలై)

"స్వయంగా ఇమామ్ బుఖారీ (రహ్మాలై) కూడా తనలాంటి వ్యక్తిని చూడలేదు."

- ఇబ్నుల్ మదీని (రహ్మాలై)

"ఇమామ్ ముస్లిం బిన్ అల్ హిజాజ్ (రహ్మాలై) ఓసారి ఇమామ్ బుఖారీ (రహ్మాలై) సన్నిధికి వెళ్ళి ఆయన రెండు కళ్ళ మధ్య (నుదుటిని) ముద్దాడుతుండగా నేను కళ్ళారా చూశాను. ఆ తరువాత ఆయన 'గురువులకు గురువూ! హదీసువేత్తల

నాయకా! మీ పాదాలు చుంబించడానికి నాకు అనుమతి ఇవ్వండి' అని అన్నారు."

- అహ్మద్ బిన్ హమ్దాన్ (రహ్మాలై)

"ఆకాశం క్రింద ఈ ధరిత్రిపై ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బుఖారీ (రహ్మాలై) ని మించిన హదీసు పండితుడు, పారంగతుడు మరొకరు లేరు."

-ఇబ్నె ఖుజైమా (రహ్మాలై)

ఇమామ్ జీవిత విశేషాల్లో ముఖ్యంగా చెప్పకోదగిన ఒక విశేషం ఉంది. ఆయన తన జీవితంలో ఏనాడూ ఎవరినీ నిందించలేదు, దూషించ లేదు, బాధించనూ లేదు. ఆయన స్వయంగా ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "పరలోక విచారణ దినాన పరోక్ష నిందను గురించి నన్ను ప్రశ్నించడం జరగదని నేను ఆశిస్తున్నాను" అని అప్పడప్పడూ అంటుండేవారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఎంతో ఆత్మాభిమానం గల వ్యక్తి. దీన్ని గురించి ఉమర్ బిన్ హఫ్స్ (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు. "బస్రాలోని హదీసు పాఠశాలలో నేను, ఇమామ్ బుఖారీ సహ విద్యార్థులం గా ఉండే వాళ్ళం. ఒకరోజు ఇమామ్ పాఠశాలకు రాలేదు. విచారిస్తే ఆ రోజు ఇమామ్ బుఖారీ దగ్గర ధరించి బయటికి రావడానికి సరిపడ్డ బట్టలు కూడా లేవని తెలిసింది. ఈ విషయం ఇతరుల ముందు బహిర్గతం కావడం ఆయనకు ఏమాత్రం ఇష్టం లేదు. అందువల్ల ఆయన ఆ రోజు ఇంటి నుంచి బయటికే రాలేదు. ఆ తరువాత ఆయన కోసం బట్టలు సంపాదించి తీసికెళ్ళి ఇచ్చాము. దాంతో ఆయన మరునాటి నుంచి పాఠశాలకు రావడం ప్రారంభించారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) రాజులకు, పాలకులకు ఎల్లప్పడూ దూరంగా ఉండేవారు. అయితే ఓ రోజు బుఖారా గవర్నర్, తన దర్బారుకు వచ్చి తనకు హదీసులు వినిపించవలసిందిగా ఇమామ్ బుఖారీ (రహ్మాలై) కి విజ్ఞప్తి చేశాడు. దాంతో పాటు, ఇతరులెవరూ పాల్గొనకుండా ఉండే ఒక ప్రత్యేక సమావేశంలో తన

www.thraithashakam.org

పిల్లలకు హదీసు విద్య నేర్పవలసిందిగా కూడా అతను ఇమామ్‌ని కోరాడు. ఇమామ్ ఈ రెండు కోర్కెలను తిరస్కరిస్తూ "విద్యను గురువు దగ్గరకెళ్ళి నేర్చుకోవలసి ఉంటుంది. నా సమావేశంలో ధనికుడు-పేద అనే తారతమ్యం లేదు. ఇక్కడికొచ్చి హదీసు విద్య నేర్చుకోవడానికి ప్రతి ఒక్కరికీ హక్కుంది" అని సమాధానమిచ్చారు.

ఈ సమాధానం విని బుఖారా గవర్నర్ అగ్రహోదగ్రుడయ్యాడు. ఆ తరువాత వారిద్దరి మధ్య దూరం మరింత పెరిగిపోయింది. గవర్నర్ ఇమామ్ బుఖారీ (రహ్మాలై) మీద పగబూని బుసలు కొట్టడం ప్రారంభించాడు. దాంతో ఇమామ్ బుఖారీ (రహ్మాలై) బుఖారా పట్నం వదలి ఖర్తుంగ్ అనే ప్రాంతానికి వెళ్ళి తలదాచుకోవలసి వచ్చింది. అక్కడకు వెళ్ళిన తరువాత ఆయన వ్యాధిగ్రస్తులయ్యారు. చివరికి హిజ్రీ శకం 256లో ఈదుల్‌ఫిత్ర్ నాడు 62 సంవత్సరాల వయస్సులో ఆయన తనువు చాలించారు. -రహ్మాతుల్లా అలై-

## జామె సహీహ్ బుఖారీ :-

ఇది ఇమామ్ బుఖారీ (రహ్మాలై) జీవితాంతం శ్రమించి, అనేక ప్రాంతాలు పర్యటించి సంకలనం చేసిన హదీసు గ్రంథం. ఆయన వివిధ ప్రాంతాల నుండి మొత్తం ఆరు లక్షల హదీసులు సేకరించి, వాటిలో ఈ గ్రంథం కోసం అత్యంత ప్రామాణికమైన 7,397 హదీసుల్ని ఎంపిక చేసి సంకలనం చేశారు. ఈ 7,397 హదీసుల్లో నుండి పునరావృత్త హదీసుల్ని తీసివేస్తే 2,602 హదీసులు మాత్రమే మిగిలి ఉంటాయి. ఇవన్నీ పటిష్ఠమైన ఆధారాలు గల నిజమైన హదీసులు. వీటిని ఆయన వివిధ శీర్షికల క్రింద ప్రకరణలుగా, అధ్యాయాలుగా విభజించి ఒక క్రమ పద్ధతిలో సంకలనం చేశారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఈ మహాకార్యాన్ని నిరంతరాయంగా 16 సంవత్సరాల పాటు ఆహోరాత్రులు చెమట ధారపోసి పూర్తి చేశారు. ఆయన ప్రతి

www.thraithashakam.org

హదీసు గ్రంథస్తం చేయడానికి ముందుగా స్నానం చేసి, రెండు రకాతులు నఫిల్ నమాజ్ చేసేవారు. ఆ తరువాతనే ఆ హదీసు వ్రాయడానికి ఉపక్రమించేవారు. ఈ విధంగా ఆయన మొత్తం హదీసుల్ని పూర్తి పరిశుద్ధావస్థలో, ఎంతో భక్తి భావంతో గ్రంథస్తం చేశారు.

ప్రసిద్ధి చెందిన వందలాది మంది హదీసువేత్తలు ఈ గ్రంథం ప్రామాణికతను పరీక్షించడానికి వివిధ రకాలుగా ప్రయత్నించారు. కానీ ఏ ఒక్కరూ ఇందులోని ఏ ఒక్క హదీసు ప్రామాణికతతో కూడా విభేదించ లేకపోయారు. కనీసం దానిపట్ల సందేహం కూడా వెలిబుచ్చలేకపోయారు. చివరికి వారంతా దివ్య ఖుర్ఆన్ తరువాత పటిష్ఠమైన ప్రామాణికతతో కూడిన నిజ గ్రంథం ఏదయినా ఉందంటే అది సహీహ్ బుఖారీ మాత్రమేనని తీర్మానించారు. ఈ విధంగా ఇస్లామీయ గ్రంథాలలో సహీహ్ బుఖారీ ద్వితీయ స్థానం పొందగలిగింది.

ఈ గ్రంథ ప్రాశస్త్యం, ప్రత్యేకతలను గురించి చెప్పాలంటే ఎన్నో విషయాలు ఉన్నాయి. ఇక్కడ రెండు విషయాలను మాత్రం ప్రస్తావిస్తున్నాం. ఇందులోని హదీసుల్ని స్వయంగా ఇమామ్ బుఖారీ (రహ్మాలై) నోట తొంభై వేలమంది హదీసువేత్తలు విన్నారు. ఈ గ్రంథానికి 53 వివరణ గ్రంథాలు వెలువడ్డాయి. వాటిలో కొన్ని వివరణ గ్రంథాలు పద్నాలుగేసి సంపుటాలలో వెలువడ్డాయి. దీన్నిబట్టి సహీహ్ బుఖారీ ఎంత జనాదరణ పొందిన గ్రంథమో ఊహించవచ్చు.

## ఇమామ్ ముస్లిం (రహ్మాలై) :-

సహీహ్ ముస్లిం గ్రంథాన్ని సంకలనం చేసిన ఇమామ్ అబుల్ హుసైన్ ముస్లిం బిన్ హిజాజ్ (రహ్మాలై) హిజ్రీ శకం 204లో నీషాపూర్‌లో జన్మించారు. బాల్యం నుండే హదీసు విద్యార్జనలో నిమగ్నులయిపోయారు. హదీసుల అన్వేషణ కోసం ఆయన ఇరాఖ్, హిజాజ్, ఈజిప్టు దేశాలు పర్యటించి, అక్కడి పండితుల దగ్గర

హదీసులు నేర్చుకున్నారు. అలాంటి పండితులలో ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గారి గురువులు కూడా ఉన్నారు. చివరికి ఆయన నీషాపూర్‌లో ఇమామ్ బుఖారీ (రహ్మాలై)ని కలుసుకొని, ఆయన దగ్గర కూడా శిష్యరికం చేశారు.

ఆ కాలంలో గొప్ప గొప్ప హదీసువేత్తలు సయితం తరచుగా ఇమామ్ ముస్లిం (రహ్మాలై) దగ్గరకొచ్చి హదీసులు వినిపోతుండేవారు. వారిలో అబూ హాతిం రాజి (రహ్మాలై), మూసాబిన్ హారూన్ (రహ్మాలై), అహ్మద్ బిన్ సల్మ (రహ్మాలై), ఇమామ్ తిర్మిజీ (రహ్మాలై) ప్రభృతులు కూడా ఉన్నారు. ఆయన బాల్యం నుండి అంతిమ శ్వాస వరకు ఎంతో దైవభీతి, ధర్మ పరాయణతలతో కూడిన పవిత్ర జీవితం గడిపారు. ఆయన ఏనాడూ ఒకరిని నిందించడం గానీ, బాధించడం గానీ చేయలేదు.

ఇమామ్ ముస్లిం మరణ సంఘటన చాలా విచిత్రంగా జరిగింది. ఒకసారి ఓ పండిత గోష్ఠిలో ఒక వ్యక్తి ఏదో హదీసుని గురించి సమాచారం అడిగాడు. అయితే ఆ సమయంలో ఇమామ్ గారికి ఆ హదీసు గురించిన సరయిన వివరాలు తెలియక పోవడం వల్ల సమాధానం ఇవ్వలేకపోయారు. తరువాత ఆయన ఇంటికి వెళ్ళి ఆ హదీసుని అన్వేషించడం ప్రారంభించారు. గ్రంథ పుటలను తిరగేస్తూ ప్రక్కనే ఉన్న ఖర్జూర పండ్ల బుట్టలో నుంచి ఒక్కొక్క ఖర్జూరాన్ని తీసి తింటూ పోయారు. హదీసు అన్వేషణలో తానెన్ని ఖర్జూర పండ్లు తిన్నానన్న సంగతిని కూడా గమనించలేదు. చివరికి అన్వేషిస్తున్న హదీసు లభించిన తరువాత బుట్టవైపు చూస్తే అది దాదాపు ఖాళీ అయిపోయింది. అప్పడర్థమైంది ఆయనకు తాను బుట్టలోని పండ్లన్నీ తిన్నానని. కానీ ఇక చేసేదేమి లేదు, జరుగవలసింది జరిగిపోయింది. ఎక్కువ పండ్లు తినడం వల్ల ఆయన వ్యాధిగ్రస్తులయ్యారు. ఆ వ్యాధితోనే ఆయన హిజ్రీ శకం 261, రజబ్ నెల 24వ తేదీ ఆదివారం నాడు సాయంత్రం శాశ్వతంగా ఇహలోకం వీడిపోయారు. చనిపోయేనాటికి ఆయన వయస్సు 55 సంవత్సరాలు మాత్రమే. స్వగ్రామమైన నీషాపూర్‌లోనే ఆయన్ని ఖననం చేశారు.

అబూహాతిం (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు. “ఇమామ్ ముస్లిం (రహ్మాలై) చనిపోయిన తరువాత ఓ రాత్రి నేను ఆయన్ని కలలో చూశాను. ఆయన దగ్గరికెళ్ళి మీ పరిస్థితి ఎలా ఉందని అడిగాను. దానికి ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ‘దేవుడు తనకు మంచి స్థితి కల్పించాడని, స్వర్గంలో తాను కోరుకున్న ప్రదేశానికి వెళ్ళే, కోరుకున్న చోట ఉండే అనుమతినిచ్చాడ’ని అన్నారు.

## జామె సహీహ్ ముస్లిం :-

ఈ గ్రంథం కూడా హదీసుల ప్రామాణికత రీత్యా, వాటి ఆరోగ్య స్థితి రీత్యా సహీహ్ బుఖారీకి ఏమాత్రం తీసిపోదు. సహీహ్ ముస్లిం కూడా సహీహ్ బుఖారీతో సమానమైన విలువ గల గ్రంథమన్న విషయంతో ధర్మవేత్తలంతా ఏకీభవించారు.

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈ గ్రంథాన్ని ఎంతో నేర్పుతో, వివేకంతో సంకలనం చేశారు. అందువల్ల దీన్ని చాలా సులభంగా అధ్యయనం చేయడానికి, అర్థం చేసుకోవడానికి అవకాశం కలిగింది. ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈ గ్రంథంలో ఇంచుమించు ఒకే భావం గల హదీసులన్నీ ఒక చోట చేర్చారు. దాంతో పాటు హదీసుల ప్రమాణ పద్ధతుల్ని, వాటి పద జాలాల్లోని వ్యత్యాసాలను కూడా సంక్షిప్త వాక్యాలలో కడు జాగ్రత్తగా తెలియజేశారు.

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) యావత్తు ముస్లిం జగత్తులో జరిపిన తన సుదీర్ఘ పర్యటన సందర్భంగా నాలుగు లక్షల హదీసుల్ని సేకరించారు. మొదట వాటిలో ఒక లక్ష పునరావృత హదీసుల్ని ఏరివేసి మూడు లక్షల హదీసుల్ని సంకలనం చేశారు. ఆ తరువాత ఓ సుదీర్ఘ కాలం పాటు వాటిని నిశితంగా పరిశీలించి చివరికి అన్ని విధాల నమ్మకమైనవని, ప్రామాణికమైనవని, భావించిన హదీసుల్ని మాత్రమే ఆయన ఈ గ్రంథానికి ఎంచుకున్నారు. ఇలా మూడు లక్షల హదీసుల్లో 7,275

www.thraithashakam.org

హదీసులు మాత్రమే గ్రంథస్తం చేయబడ్డాయి. అయితే వాటిలోనూ పునరావృత హదీసుల్ని తొలగిస్తే నాలుగు వేల హదీసులు మాత్రమే మిగులుతాయి.

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) స్వయంగా తన గ్రంథం గురించి ఇలా అన్నారు. “నేనీ గ్రంథంలో ఏ హదీసుని గ్రంథస్తం చేసినా క్షుణ్ణంగా ఆలోచించిన మీదట తగిన ఆధారాలతోనే దాన్ని గ్రంథస్తం చేశాను. అలాగే ఈ గ్రంథంలో నుంచి ఏ హదీసుని తొలగించినా క్షుణ్ణంగా ఆలోచించిన తరువాత తగిన ఆధారాలతోనే దాన్ని తొలగించారు. అందువల్ల ప్రపంచ ములోని జనమంతా రెండొందల యేండ్ల పాటు హదీసుల్ని పరిశీలించి వ్రాసినా, చివరికి వారి నమ్మకం ఈ గ్రంథం మీదే ఉంటుంది.”

సహీహ్ ముస్లిం, సహీహ్ బుఖారీ గ్రంథాలలో ప్రామాణికత తదితర విషయాలరీత్యా ఏది గొప్ప అనే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. సహీహ్ బుఖారీ అన్నిటికంటే ఉన్నతమైనదని కొందరు అభిప్రాయపడితే, సహీహ్ ముస్లిం అన్నిటికంటే ఉన్నతమైన గ్రంథమని, మరికొందరు అభిప్రాయ పడ్డారు. ఈ రెండు అభిప్రాయాలకు భిన్నంగా ఇంకొందరు, కొన్ని విషయాలరీత్యా సహీహ్ బుఖారీ ఉన్నతమైనది, మరికొన్ని విషయాలరీత్యా సహీహ్ ముస్లిం ఉన్నతమైనదని అభిప్రాయ పడ్డారు.

ఏమయిన్నప్పటికీ ఈ గ్రంథకర్తలిద్దరూ గొప్ప ధర్మపరాయణులు, దైవ భీతిపరులు, నిజాయితీపరులన్న విషయంలో మాత్రం ఎవరి మధ్యా ఎలాంటి భేదాభిప్రాయం లేదు. అలాంటి మహనీయులు సంకలనం చేసిన బుఖారీ, ముస్లిం గ్రంథాలలోని ఏకీభవిత (ముత్తఫఖున్అలై) హదీసుల సంగతి ఇక చెప్పేదేముంది? పటిష్ఠమైన ప్రామాణిక గ్రంథాలలోని ఈ ‘ఏకీభవిత’ హదీసులు మరెంత ప్రామాణిక మైనవో ప్రత్యేకంగా వివరించనవసరం లేదు.

సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలను రెండు సముద్రాలుగా, వాటిలో ఉన్న హదీసుల్ని ముత్యాలు, పగడాలుగా ప్రస్తుత సంకలనకర్త ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ

www.thraithashakam.org

**అభివర్ణించిన సంగతి ప్రారంభంలో నేను ప్రస్తావించాను. అంటే ఒక సముద్రంలో ముత్యాలు ఉంటే, మరో సముద్రంలో పగడాలు ఉన్నాయన్నమాట. ఈ రెండూ సముద్రాలలోని ముత్యాలు, పగడాలను ఏరి కూర్చిన హారం ఇంకెంత విలువైనదో ఊహించండి. ఆ అమూల్యమైన హారమే మీ ముందున్న ఈ గ్రంథం!**

**ఇందులో మొత్తం 1906 హదీసులున్నాయి. సహీహ్ బుఖారీలో పునరావృత హదీసులు తీసివేయగా 2602 హదీసులు ఉన్నాయి. అంటే ఈ గ్రంథంలో సహీహ్ బుఖారీలోని 696 హదీసులు తగ్గిపోయాయి. మరో మాటలో చెప్పాలంటే ఇమామ్ ముస్లిం (రహ్మాలై) గారి గ్రంథంలో లేని 696 హదీసులు ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గారి గ్రంథంలో చోటు చేసుకున్నాయన్నమాట. వేరొక రకంగా చెప్పాలంటే ఈ 696 హదీసుల విషయంలో ఇరువురు ఇమాముల మధ్య పూర్తిగా ఏకీభావం లేదన్నమాట.**

ఇప్పుడు వాటి నుండి మనము లెక్కవేసుకుంటూ పోతే ఇంకా మనకు ఎన్ని చివరకు మిగిలి ఉన్నాయి అంటే 1900 హదీసులే ముఖ్యముగా మనము తీసుకున్నాము. అంటే ఇమామ్ బుఖారి గారు వ్రాసిన దానిని ఇమామ్ ముస్లీమ్ గారు ఒప్పుకోవడము లేదు. ఇమామ్ ముస్లీమ్ గారు వ్రాసిన దానిని ఇమామ్ బుఖారి గారు ఒప్పుకోవడము లేదు. ఆ విధముగా ఇద్దరి వాక్యములలో అభిప్రాయబేధాలు వచ్చాయి, కాబట్టి అవన్నీ తీసివేస్తే చివరకు మనకు దాదాపు 1906 హదీసులు మిగిలినాయి. ఈ రకముగా మనము లెక్కవేసుకుంటే 1906 హదీసులను గట్టిగా ఈ రోజు మనము సేకరించి పెట్టుకున్నాము. ఇట్లు ఉండేటటువంటి వాటిలో ఏవి సరియైనవి, ఏమి సరియైనవికాదు అని మనము లెక్కవేసుకుంటే, ఇప్పుడు ప్రతి ఒక్కరు అన్నీ సత్యమే అని నమ్మేటటువంటి పరిస్థితి వచ్చింది. ఆ లెక్క ప్రకారము పోతే అవన్నీ ఖుర్ఆన్ గ్రంథానికి భంగము కల్గించేటట్లుగా,

ప్రవక్త వాక్యములకు భంగము కల్గించే విధముగా ఉన్నాయని ఆ రోజు హదీసు పండితులే వాటిని తీసివేయడము జరిగింది. ఇది మనము చెప్పుకోవలసిన విషయము, అర్థము కావలసిన విషయము. మీకు ఖురాన్ అంటే ఏమో తెలియదు, హదీసులు అంటే ఏమో తెలియదు కాబట్టి మీకు ముందుగా హదీసులు అంటే ఇవి, ఖురాన్ అంటే ఇది అని చెప్పుతున్నాము. ఈ రోజు ముస్లీమ్‌లు అంతా ఎక్కువగా హదీసులనే ఆచరిస్తున్నారు. అంటే 95% హదీసులను, కేవలము 5% మాత్రము ఖురాన్‌ను అనుసరిస్తున్నారని మనము చెప్పుకోవాలి. ఇప్పుడు ఖురాన్ యొక్క పవిత్రతను ఈ 'ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ' గొప్పగా చెప్పుకుంటూ ఉంది, ఖుర్‌ఆన్ యొక్క పవిత్రతను అది కాపాడుతూ ఉంది. అక్కడ ఖుర్‌ఆన్ యొక్క పవిత్రత తరువాత ముహమ్మద్ ప్రవక్తగారి గౌరవానికి ఎక్కడా భంగము కలుగకుండా చేసేటటువంటి విధానము ఈ సొసైటిలో ఉంది, కాబట్టి ఇప్పుడు మనకు అటువంటిది తప్పు ఏదైనా ఎక్కడయినా హదీసులలో కనిపించినా, కొన్ని లక్షల హదీసులను వాళ్ళు తీసివేసినప్పుడు, మనము కూడా ఒకటో రెండో ప్రక్కన పెట్టి, దానికంటే ముఖ్యమైనవి ఖుర్‌ఆన్ అని చెప్పుకోవడము మనకు జరుగుతుంది. ఆ లెక్క ప్రకారము పోతే ఖుర్‌ఆన్ గ్రంథము తరువాత ఈ హదీసు గ్రంథాలు వచ్చాయని తెలియుచున్నది. హదీసులలో ఇంకా మనకు యోగ్యమైనవి ఎన్ని? అయోగ్యమైనవి ఎన్ని? అని తెలుసుకోవాలి. ఆ విధముగా మనము లెక్కవేసుకుంటూ పోతే, హదీసులు, ఖుర్‌ఆన్ ఇవి మీకు క్రొత్త వాక్యములుగా కనిపించినా గానీ, ఇవి మనము ఇస్లామ్ మతమును అర్థము చేసుకొనే దానికి పునాదిలాంటివి అని కొందరు చెప్పినా హదీసులకంటే ఖుర్‌ఆన్ గ్రంథమే ముస్లీమ్‌లకు ముఖ్యమైనదని మరి కొందరు అంటున్నారు. ఖుర్‌ఆన్ దైవ గ్రంథమని మేము అంటున్నాము.

ప్రబోధానంద యోగీశ్వరులు భగవద్గీత చెప్పుతున్నాడు, మరలా ఇస్లామ్‌లోనికి వెళ్ళినాడు అని మీరు అనుకోవద్దండి. నేను క్రైస్తవములో మాట్లాడుతున్నాను, ఇస్లామ్‌లో మాట్లాడుతున్నాను, హిందుత్వములో కూడా మాట్లాడుతున్నాను. ఈ రోజు 'ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటి' వాళ్ళు నన్ను అడిగినప్పుడు, నాకు తెలిసినంతవరకు నేను కొన్ని విషయాలు వాళ్ళతో చెప్పగలిగాను. ఆ చెప్పిన విషయాలనే మీకు కూడా ఇప్పుడు అందిస్తున్నాము. మీరు కూడా దీనిని అర్థము చేసుకోగలిగితే, ఇస్లామ్ అంటే ఏమి? ఇందుత్వము అంటే ఏమి? అనేది తెలుస్తుంది. ఒకరికొకరు ద్వేషాలు పెంచుకోకుండా మీ దేవుడు వేరు, మా దేవుడు వేరు అని అనుకోకుండా అందరూ జ్ఞానమును గురించి అవగాహన చేసుకొనేదానికి అవకాశము ఉంటుంది. హిందువులను ఆ మతములోకి పోమ్మని చెప్పలేదు కదా! ముస్లీమ్‌లను ఈ మతములోకి రమ్మని చెప్పలేదు కదా! ఎవరినీ మతాలు మార్చుకోమని నేను చెప్పలేదు కదా! మతములో ఉండే సారాంశము తెలుసుకోమని చెప్పుతున్నాను. ఏ మతములో ఉండే వాళ్లు ఆ మతములోనే ఉండండి. మతాల మార్పిడి మంచిది కాదు అని మేము మొదటి నుంచి చెప్పుతున్నాము. అంతమాత్రమున మీరు ఉలిక్కి పడడము ఎందుకు? ఆ రకముగా అసూయ లేకుండా విషయాన్ని ఆవగాహన చేసుకోండి. అవగాహన చేసుకోవడము తప్పులేదు కదా! ఇదేమీ మీకు దుష్టకార్యము కాదు కదా! మరి మనము ఎన్నో పనికి మాలిన పనులు చేస్తున్నాము. దొంగతనములు చేస్తున్నాము, రకరకాలుగా మోసాలు చేస్తున్నాము, ఎంతో హీనమైన పనులు చేస్తున్నాము. ఒక పవిత్ర గ్రంథాన్ని గురించి తెలుసుకోవడము హీనమైన పనేమీ కాదు కదా! అదేమి చెడ్డ పని కాదు కదా! కానీ కొంతమంది మమ్మల్ని కూడా నిందించిన వాళ్ళు ఉన్నారు.

వాళ్లు అజ్ఞానులు, వాళ్లతో మాకు పని లేదు అనే ఉద్దేశ్యముతో మా పని మేము చేస్తున్నాము అంటే ఒకరి నింద గురించి మేము పెద్దగా పట్టించుకోలేదు. మేము దేవుని జ్ఞానాన్ని ప్రచారము చేయదలుచుకున్నాము. దేవుని జ్ఞానాన్నే చెప్పుతున్నాము. కాబట్టి ఈ రోజు మా సంఘము అయిన **"ప్రబోధ సేవా సమితి"**లో ఎంతోమంది ముస్లీమ్‌లు ఉన్నారు. ఎంతోమంది క్రైస్తవులు ఉన్నారు. వాళ్ళు అందరూ మా జ్ఞానాన్ని అర్థము చేసుకోగలిగి వుంటేనే కదా! ఇక్కడికి వచ్చేది? కానీ మతద్వేషాలు పెట్టుకుంటే ఎవరైనా ఇక్కడికి వస్తారా? కానీ మతద్వేషాలు లేకుండా ఉండాలి అంటే మొదట మీకు మతాల అవగాహన ఉండాలి. ఏ మతము ఏమిటి అని తెలియాలి. ఇప్పుడు మనకు క్రైస్తవ మతము గురించి పూర్తిగా తెలియదు. అందులో కూడా దాని విషయాలు తెలియజేస్తాము. అట్లే ఇస్లామ్ మతము గురించి పూర్తిగా తెలియదు కాబట్టి మేము కొన్ని విషయాలు మాత్రమే మీకు తెలియజేస్తున్నాము. ఆ విషయాలను మీరు లెక్కవేసుకుంటే ఇప్పుడు ఖుర్ఆన్ అంటే ఏమి? హదీసు అంటే ఏమి? అని మీకు తెలిసిపోయింది.

హదీసు సాంప్రదాయములు, ఖుర్ఆన్ జ్ఞానము కొంతవరకు తెలుసుకొన్నాము. మనకు భగవద్గీతలో దేవుని జ్ఞానము ఉంది కానీ నీవు పంచ కట్టుకోవడము, బొట్టు పెట్టుకోవడము అనేటివి దేవుని జ్ఞానము కాదు అవి భగవద్గీతలో లేవు. నీవు పెట్టుకున్నా, పెట్టుకోక పోయినా దేవుని జ్ఞానము అనేది నీ లోపలే ఉంటుంది. ఇవన్నీ సాంప్రదాయాలు, అయితే సాంప్రదాయాలు వేరు, జ్ఞానము వేరు. ఇప్పుడు మనము తెలుసుకొనేది ఏమిటి అంటే ఇస్లామ్ మతములో ఉండే సాంప్రదాయములు తెలుసుకుంటే, మనము వాటిలో ఉండే అర్థము ఏమిటి అని తెలుసుకోగలుగు తాము. కానీ ఇక్కడ ముఖ్యముగా ఏమి చెప్పుతున్నాము అని గమనించితే

www.thraithashakam.org

మీరు అర్థము చేసుకోవలసినది జ్ఞానముకంటే సాంప్రదాయాలు ముఖ్యమైనవి కాదు, పెద్దవి కాదు. జ్ఞానము తరువాతనే మీకు సాంప్రదాయాలు కాబట్టి ముందు దేవుని జ్ఞానాన్ని తెలుసుకో! ఖురాన్ గ్రంథములో ఉన్న దైవత్వమును తెలుసుకో! తరువాత ఇస్లామ్ మతములో ఉన్నటువంటి సాంప్రదాయాలు నేర్చుకోండి. మీకు మతము కాదు ముఖ్యము, దైవత్వము ముఖ్యము. అందువలన మీరు ఖుర్ఆన్ గ్రంథాన్ని గొప్పగా చూసుకోండి. తరువాత హదీసు గ్రంథాన్ని చూసుకోండి. మొట్ట మొదటనే హదీసు గ్రంథాన్ని చూసుకొని ఖుర్ఆన్ గ్రంథాన్ని ప్రక్కన పెట్టవద్దండి. దానికి విలువ లేకుండా చేయవద్దండి. కాబట్టి మేము ఏమి చెప్పుతున్నాము అంటే ముహమ్మద్ ప్రవక్తగారి యొక్క గౌరవమునకు లోటు లేకుండా దేవుని యొక్క శక్తికి ఏమాత్రము భంగము కలుగకుండా, అందరూ గుర్తించే విధముగా ఇప్పుడు హదీసులు, ఖుర్ఆన్ విషయాలు మనము చెప్పుకుంటున్నాము. ఇందులో ఏమి తప్పు లేదు. ఎవరూ సిగ్గుపడాల్సిన పని లేదు. ఒక హిందువు ముస్లీమ్ మాటలు చెప్పడము ఏమిటి? అని అనుకోకూడదు. ఇది సిగ్గుపడాల్సిన విషయము ఏమీ కాదు, సంతోష పడవలసిన విషయము. ఎందుకంటే వాళ్ళకు తెలియని విషయాలు మనము తెలుసుకొని చెప్పగలుగు తున్నాము అంటే మీకు కూడా గొప్పగా ఉంటుంది. సంతోషముగా ఉంటుంది. ఎందుకంటే హిందువులకు జ్ఞానము చెప్పే వ్యక్తి, ఇస్లామ్ మతములో కూడా జ్ఞానము చెప్పుతున్నాడు అంటే మీకు గొప్పతనమే కదా. కాబట్టి మీరు కూడా సంతోషించాల్సిన విషయమే. ఇప్పుడు ముఖ్యముగా మనము ఏమి చెప్పుతున్నాము అంటే హదీసులు అనేటి వాటికంటే ఖుర్ఆన్ గొప్పది. ఖుర్ఆన్ గ్రంథములో ఉండేటటువంటి జ్ఞానము గొప్పది. ఖుర్ఆన్ గ్రంథములో ఉండేటటువంటి జ్ఞానము ప్రకారము, ముందు దానిని మనము

అనుసరిస్తే తరువాత హదీసులను గురించి తెలియవచ్చు. అదే రకముగా ఇందూ జ్ఞానములో ఉండేటటువంటి జ్ఞానాన్ని మనము తెలుసుకోగలిగితే, తరువాత హిందూ సాంప్రదాయాలను మనము ఏ విధముగానైనా తెలుసుకోవచ్చు, సాంప్రదాయాలకంటే ముందు జ్ఞానము ముఖ్యము. అందువలన ఈ జ్ఞానానికి భంగము కల్గించే సాంప్రదాయాలు ఎక్కడా ఉండకూడదు. అలాగే ఉన్నాయి అని 6 లక్షల హదీసులు వ్రాసుకున్నటువంటి ఆయన చివరకు 2602 హదీసులకే ఎందుకు వచ్చాడు? 4 లక్షల హదీసులు వ్రాసుకున్నటివంటి ఆయన 4000 హదీసులకే ఎందుకు వచ్చాడు? వాటిల్లో కూడా ఏదో భంగము కల్గించేటటువంటి విషయాలు ఉన్నాయని చివరకి 1900 హదీసులను మాత్రము ఉంచాడు. కానీ ఈ రోజు మనము హదీసులను చిన్నపుచ్చి మాట్లాడడము లేదు. వాటిని వ్రాసిన పెద్దలే హదీసులను ఆ విధముగా తగ్గించారు. కాబట్టి హదీసు పెద్దలను (పండితులను) అనుసరించి మనము కూడా ఎక్కడైనా ఏదైనా పొరపాటు ఉంటే అటువంటి హదీసులను మనము విమర్శించుకోవాల్సిందే, విడదీసుకోవాల్సిందే. వాటిని వదలిపెట్టి ఖుర్ఆన్ గ్రంథములోనికి మనము ప్రవేశించాల్సిందే, ఖుర్ఆన్ గ్రంథమును గొప్పగా చెప్పుకోవాల్సిందే. మనము హదీసు గ్రంథాలలో ఉండేటటువంటి ఎక్కడైనా లోపాలను ఏ విధముగా గుర్తించవచ్చు అని అంటే ఇప్పుడు మనము ఒక విషయము చెప్పుకుందాము.

ఒక వ్యక్తి ఎక్కడైనా ప్రశ్న వేస్తే దానికి సంపూర్ణమైన జవాబు ఉంటే అది జ్ఞానము, జవాబు లేకపోతే అది అజ్ఞానము అని చాలామార్లు మనము చెప్పుకున్నాము. ఆ విధముగానే ఒక ముస్లీమ్ వ్యక్తి ఒక ముస్లీమ్ పండితున్ని అంటే బాగా జ్ఞానము తెలిసిన వ్యక్తిని ఒక ప్రశ్న అడిగాడు.

www.thraithashakam.org

“ఈ హదీసులో ఒక విషయము వ్రాయబడి ఉంది. నాకు అర్థము కాలేదు నీవు చెప్పుతావా” అని అడిగినాడు. అంటే మత పెద్దలు, హదీసు పండితులు ఆ విషయాలు చెప్పేదానికే కదా! ఉండేది. అప్పుడు నేను చెప్తాను అని పండితుడు అన్నాడు. అప్పుడు ముస్లీమ్ వ్యక్తి ఇలా అడిగాడు “ఒకానొకరోజు ముహమ్మద్ ప్రవక్త గారికి జ్ఞానాన్ని తెలియజేసిన దైవదూత అయిన జిబ్రయేల్, ముహమ్మద్ ప్రవక్తగారిని పిలుచుకొని పాకిస్తాన్‌కు పోయి, అక్కడ మసీదులో ప్రార్థన చేసాడు. ప్రార్థన చేసిన తరువాత అక్కడ నుంచి జిబ్రయేల్ దూత, ముహమ్మద్ ప్రవక్తగారిని తీసుకొని పోయినట్లు ఒక హదీసులో వ్రాయబడి ఉంది. ఆకాశము వరకు పోయిన తరువాత, జిబ్రయేల్ దైవదూత ఆకాశమును తెరుచుకో అని అంటే మొదటి ఆకాశము తెరుచుకుంది. ఆకాశము తెరుచుకున్న తరువాత అక్కడ అందరికి తండ్రి అయిన ఆదాము ఉన్నాడు అని వ్రాసారు. అందరికి తండ్రి అయిన ఆదాము ఇతను దైవ ప్రవక్తే అని ప్రవక్తను దీవించాడు. అక్కడి నుంచి ఆయన దీవెనలను తీసుకొని మరలా జిబ్రయేల్, ముహమ్మద్ గారు ఇద్దరూ ఇంకా పైకి వెళ్ళితే అక్కడ రెండవ ఆకాశము ఉంది. అప్పుడు జిబ్రయేల్ దైవదూత రెండవ ఆకాశమును తెరుచుకో అని కోరితే రెండవ ఆకాశము కూడా తెరుచుకుంది. అక్కడ ఈసా, ఎషయా అను ఇద్దరు గొప్ప వ్యక్తులు ఉన్నారు. ఆ ఇద్దరు గొప్ప వ్యక్తులు ప్రవక్తను దీవించడము జరిగింది. ఈ రకముగా తర్వాత వారు మూడవ ఆకాశానికి పోయారు. అక్కడ కూడా ఒక ఆయన గొప్ప ప్రవక్త ఉండేవాడు. అతను కూడా ప్రవక్తగారిని దీవించడము జరిగింది. నాలుగో ఆకాశానికి పోయినారు. అక్కడ కూడా ఉన్నవారు దీవించడము జరిగింది.

ఇలా ఆరవ ఆకాశము వరకు పోయినప్పుడు ఆరవ ఆకాశము కూడా తెరుచుకోబడింది. అక్కడ పూర్వము ఉన్నటువంటి మూసా అనే

ప్రవక్త ఉండేవాడు. అతను ప్రవక్తను దీవించడము జరిగింది. దీవించిన తరువాత మూసా ప్రవక్త ఏడ్చాడట. ముహమ్మద్ ప్రవక్త గారిని చూసి ఆయన ఏడ్చాడు. ఎందుకు ఏడ్చినాడు అంటే నా కాలములో నేను జ్ఞానము చెప్పితే ఎవరూ స్వర్గానికి పోయే వాళ్ళు కాదు, కానీ నీవు చెప్పుతూ ఉంటే చాలామంది స్వర్గానికి పోతున్నారు. అందువలన నాకు ఏడుపు వచ్చింది అని అన్నాడు. అలా ఏడ్వడము సంతోషముతోనా, అసూయతోనా నాకేమీ అర్థము కాలేదు, కానీ ఒక రకముగా అసూయతోనే అనుకుందాము. తరువాత అక్కడ నుంచి వాళ్ళు ఏడో ఆకాశము వరకు పోయారు. అప్పుడు ఏడవ ఆకాశము తెరుచుకుంది. అక్కడ దేవుడు ఉన్నాడన్నమాట. బాగా జ్ఞాపకము పెట్టుకోండి. ఇంతకు ముందు ఒక ఆయన ఇంద్రధనస్సులో ఏడు రంగులే ఎందుకు ఉన్నాయి? అని ఒక ప్రశ్న అడిగాడు. ఇంద్ర ధనుస్సులో ఏడురంగులు ఉండేది వాస్తవమే. అక్కడ ఎనిమిది లేవు, తొమ్మిది లేవు కానీ ఏడే ఉన్నాయి. ఇక్కడ కూడా ఏడే ఆకాశములు ఉన్నాయి. మనకు తెలియదు కానీ ఇక్కడ ఏదో లిటిగేషన్ ఉంది. అది ముస్లీమ్‌లకు కూడా తెలియలేదు. కానీ ఇక్కడ మనకు ఏమి తెలిసింది అంటే ఏడవ ఆకాశములో దేవుడు ఉన్నాడని మనకు తెలిసింది. ఇది ఒక గొప్ప రహస్యము, ఇది వాస్తవమే, ఇది నూటికి నూరుపాళ్లు సత్యమే. ఇప్పుడు దేవుని దగ్గరకు పోయి వీళ్ళు దేవునికి నమస్కరించడము జరిగింది. అప్పుడు దేవుడు వీళ్ళకు ఒక విధి విధానాన్ని సమర్పించాడు.

దేవుడు మీరు ఒక రోజులో 50 పూటలు నమాజు చేసుకోండి అని చెప్పాడు. అంటే ఒక రోజుకు 50 సార్లు సరే! అని అక్కడ ఒప్పుకొని ముహమ్మద్ ప్రవక్తగారు ఆరవ ఆకాశానికి వచ్చారు. అక్కడ నుంచి క్రిందికి (ఆరవ ఆకాశానికి) వస్తూనే, అక్కడ ఉన్న మూసా ప్రవక్త ఏమి అయిందని

వారిని అని అడిగినాడు. 50 సార్లు నమాజు చేయమని దేవుడు చెప్పినాడు అని ముహమ్మద్ ప్రవక్త గారు చెప్పారు. ఈయన ముందే ఏడ్చినాడు. మీరు ఉండే దానివలనే ఎక్కువమంది స్వర్గానికి పోతున్నారు. నేను ఉన్నప్పుడు ఎవరూ పోకుండా ఉన్నారు అని ఈయనకు అసూయ ఎక్కువైపోయిందో మరి ఏమి ఎక్కువ అయిపోయిందో కానీ మీరు 50 సార్లు ఎక్కడ చేస్తారు? మరలా వెనక్కి పోయి తగ్గించుకోమని దేవున్ని అడగండి అని మూసా ప్రవక్త చెప్పినాడు. అప్పుడు ముహమ్మద్ ప్రవక్త గారు ఏదో ఒక విధముగా చేస్తాములే అని అంటే, వద్దు వద్దు మీరు చేయలేరు, చాలా కష్టపడుతారు. ఎందుకంటే 50 సార్లు రోజంతా నమాజు చేయడమే సరిపోతుంది. ఇంకా అన్నము ఎప్పుడు తింటారు? నీళ్ళు ఎప్పుడు త్రాగుతారు? పనులు ఎప్పుడు చేసుకుంటారు? బ్రతికేదానికి ఎప్పుడు సంపాదించుకుంటారు? కాలము అంతా దానికే సరిపోతుంది. అలా వద్దు నీవు పోయి దేవున్ని అడుగు అని మూసా చెప్పాడు. సరే అని అప్పుడు ప్రవక్తగారు, జిబ్రయిల్ దూతగారు ఇద్దరూ పైకి పోవడము జరిగింది. దేవుడు మొదట ఎక్కడ ఉన్నాడో అక్కడే ఉన్నాడు. అప్పుడు అల్లాహ్‌ను ఏమి అడిగినారు అంటే, ఈ 50 నమాజులు మేము చేయలేము కొంత తగ్గించుకోమని అని అడిగారు. అప్పుడు అల్లాహ్ ఏదో విధముగా చేయిపోండి అని కొంత తగ్గించుకొని పంపించినాడు. తరువాత వాళ్ళు క్రిందికి వస్తే, మరలా మూసా ఏమయింది అని అంటే ఐదో ఆరో తగ్గించుకున్నాడు అని ముహమ్మద్ ప్రవక్త చెప్పాడు. అప్పుడు అలా కూడా మీరు చేయలేరు, చాలా కష్టము, చూడండి! మీరు పోయి మరలా అడగండి అని మూసా చెప్పాడు. సరే అని వాళ్ళు మరలా తిరిగి ఏడవ ఆకాశనమునకు పోయారు. ఈ విధముగా వీళ్ళు పోవడము, ఆయన తగ్గించుకోవడము

మరలా వీళ్ళు తిరిగి పోవడము, ఆయన తగ్గించుకోవడము ఇక్కడికి వస్తే మూసా పోండి అని మరలా చెప్పడము ఈ రకముగా 7, 8 సార్లు తిరిగిన తరువాత, చివరకు 5 సార్లు చేసుకోండి అని అల్లాహ్ చెప్పినాడంట. చివరకు 50 నుంచి 5 సార్లకు వచ్చింది. 5 సార్లకు వస్తే, మరలా మూసా ఏమి చెప్పినాడు అంటే 5 సార్లు కూడా మీరు చేయలేరు మీకు కష్టము ఇంకొకసారి వెళ్ళి అడుగుపోండి అని అంటే ముహమ్మద్ ప్రవక్త "అక్కడకు పోయి పోయి నాకు సిగ్గు అవుతుంది. నేను పోయి అడగలేను. చాలు 5 సార్లు, మేము ఏదో విధముగా నమాజ్ చేసుకుంటాము" అని ఆయన మాటను లెక్కపెట్టుకోలేదు.

5 నమాజులతో తృప్తిపడి, వాళ్ళు క్రిందికి వచ్చారు. క్రిందికి వచ్చేటప్పుడు వాళ్ళకు దారిలో అన్ని ఆకాశాలలో పాపము చేసిన వారు ఎడమ ప్రక్క, పుణ్యములు చేసినవారు కుడిప్రక్క ఉన్నట్లు కనిపించారు. వ్యభిచారము చేసినవాళ్ళ ఎదలకు కొండ్లు వేసి దేవుడు వ్రేలాడకట్టినాడంట. అంటే వాళ్ళు ఆ రకమైన కర్మను అనుభవిస్తున్నారు. ఇంకా అబద్ధాలు చెప్పిన వాళ్ళకు నోటిలో అగ్ని పోసినారట. ఆ అగ్నికి కడుపులో ప్రేవులు ఉడుకుతా ఉన్నాయట. ఈ రకముగా అనేక రకాలుగా నరకము అనుభవిస్తున్నారంట. ఈ రకముగా స్వర్గము అనుభవించేవాళ్ళు ఉన్నారు. నరకము అనుభవించే వాళ్ళు ఉన్నారు. రకరకాల నరకాలను స్వర్గాలను కుడి ఎడమ ప్రక్కల వీళ్ళు చూస్తూ రావడము జరిగింది. ఇదంతా జరిగిన తరువాత తప్పని సరిగా దేవుని దగ్గర నుంచి వచ్చిన ఆజ్ఞ, మీరు 5 పూటల నమాజు చేసుకోండి అని ప్రజలకు చెప్పడము జరిగింది. అప్పటి నుండి అలానే నమాజు చేసుకుంటున్నారు. ఒక మంచి పని చేసే దానికి చాలా అబద్ధాలు చెప్పవలసిన పని వచ్చింది. అలా లేకుండా మంచి పనిని

మంచి పని గానే చెప్పితే సరిపోతుంది. నమాజు చేయడము (దేవుని ప్రార్థన చేయడము) చాలా మంచి పని. అయినా ఈ కథ చెప్పుకోకుండా చెప్పివుంటే బాగుండేది. ఎలా అయితే హిందూమతములో పురాణాలు చెప్పినారో అలానే వీరు చెప్పారు. భక్తిని కలుగజేసేదానికి మనిషికి పురాణాలు చెప్పినారు. కానీ భక్తిని కలుగజేసేదానికి అన్ని అబద్ధాలుచెప్పినారు అన్నమాట. అబద్ధాలు చెప్పినప్పుడు కొంచెము తెలివి ఉన్నవాడు ఇది అంతా అబద్ధము అని అంటే మొదటికే మోసము వచ్చి వదలి పెట్టేదానికి అవకాశము ఉంది. ఆ రకముగానే ఇప్పుడు ఈ కథలో దేవునికి ప్రార్థన చేయడము, చెయ్యమని చెప్పడము బాగుంది, దీనిని ఇంకొక రకముగా దేవుడు ఇలాగే చెప్పాడు మీరు కూడా ఇలాగే చేయండి అని అంటే బాగుండేది. కానీ ఈ విధముగా ఈ కథను అల్లడము పొరపాటు అయింది. ఇది హదీసు గ్రంథములో ఉండే ఒక ఘట్టము. అయితే దీంట్లో ఉండే తప్పు ఒప్పులను మనము తీసుకుంటే ఇది ఖుర్ఆన్ గ్రంథములోని దైవ ప్రవక్త గౌరవానికి, అల్లాహ్ గౌరవానికి భంగము కల్గించే వాక్యములుగా ఉన్నాయి. అందువలన మనము వీటిని సవరించుకొని ఈ కథను మరచిపోయి, మనము దేవుని కోసము ప్రార్థన చేయాలి అనేదే ముఖ్యముగా పెట్టుకొని 5 పూటల నమాజు చేయండి మీరు అని నేను అందరికీ తెలియజేస్తున్నాను. అందరికీ అంటే హిందువులు కూడా దేవున్ని 5 పూటల తలుచుకోవడము మంచిది.

ముస్లీమ్‌లు 5 పూటలు దేవున్ని ప్రార్థన చేయండి మంచిదే కానీ ఈ కథను బట్టి మీరు చేయవద్దండి. కథను బట్టి చేస్తే మనకు ఇబ్బంది అవుతుంది. ఎందుకు ఇబ్బంది అవుతుంది అంటే, ఒకటవ ఆకాశము దగ్గరకు పోయినపుడు అక్కడ ఆదాము ఉన్నాడు. అందరికీ తండ్రి ఆదాము

అని అక్కడ ఆ మాట చెప్పారు. మరి అక్కడ ఏమి అంతరాయము కల్గుతుంది అని ఆలోచిస్తే అందరికీ తండ్రి దేవుడు ఒక్కడే కానీ మధ్యలో ఆదాము ఎక్కడ నుంచి వచ్చాడు? ఆదాము మీ నాయన కాదు, మా నాయన కాదు. మనందరికీ తండ్రి, మీ నాయనకు, మా నాయనకు, నీకు అందరికీ తండ్రి ఒక్కడు ఉన్నాడు. ఆయనే **'దేవుడు'** (అల్లాహ్) అని మనము చెప్పుకుంటూ వచ్చినాము. ఇప్పుడు ఖురాన్ గ్రంథము కూడా అదే విషయమునే చెప్పుతూవుంది. అటువంటప్పుడు ఆదాము కూడా ఎవరికీ తండ్రి కాడు. అయితే అందరికీ తండ్రి ఆదాము అని అంటే దేవున్ని ప్రక్కన పెట్టాల్సిన పని వస్తుంది. 'అందరికీ తండ్రి ఆదాము' అను వాక్యము మనకు విరుద్ధముగా కనిపిస్తుంది. వేరే మతస్థులు విమర్శించే దానికి అవకాశము ఉంది. వేరే మతస్థులు ఇస్లామ్ గ్రంథాన్ని విమర్శించే దానికి, అవకాశము ఉంది, కాబట్టి అటువంటి అవకాశము వాళ్ళకు ఇవ్వకుండా ఉండాలి అని అంటే అదాము అందరికి తండ్రియని మనము చెప్పుకో కూడదు. ఎందుకంటే అల్లాహ్ అందరికీ తండ్రి. ఆయన సృష్ఠికర్త అందరినీ సృష్ఠించినటువంటివాడు సమస్త మానవులకు అల్లాహ్ తండ్రి అయినప్పుడు మధ్యలో ఆదాము అనడము మంచిది కాదు. ఈ మాటను మనము ప్రక్కన పెడుదాము. ఇంకా ఏముంది అంటే దేవుడు చెప్పిన తరువాత దేవుని వాక్యమును గొప్పగా మనము స్వీకరించేటట్లుగా ఉండాలి కానీ, మాటి మాటికి నమాజు చేయడము నాతో కాదు అని చెప్పితే ఏమి బాగుంటుంది. దేవుడు చెప్పిన వాక్యమును నాతో కాదు అని మరలా తిరిగి ఎదురు చెప్పినట్లు ఉంటుంది. అంటే దేవుడు ఒక పని చెప్పితే మనము నాతో కాదు, నాతో కాదు అంటే ఎంత బాగుంటుంది. దేవునికి గౌరవము ఉంటుందా!

కాబట్టి అటువంటి సాంప్రదాయాన్ని మనిషికి నేర్పించకుండా ఉండాలి అంటే దేవున్ని తిరిగి అడుగకూడదు. దేవుడు ఏమి చెప్పితే అది చేసే విధముగా ఉండాలి. నీవు చనిపో! అంటే చనిపోయేటట్లుగా ఉండాలి. అగ్నిలో దూకు అంటే దూకేటట్లుగా ఉండాలి. అందరికీ పెద్ద దేవుడు. అందరికీ పెద్ద దేవుడు అయినప్పుడు దేవుని మాటలు వినకుండా నాకు చేతకాదు, నాకు చేతకాదు అంటూ పోతే ఎలా? 50 నుంచి 5కి తగ్గించుకుంటే ఏమౌతుంది? నీ అంత సోమరి మనిషే లేడు, ముస్లీమ్ మతములో సోమరి మనుషులున్నారని చెడ్డపేరు వస్తుంది. కాబట్టి ఈ పదాన్ని కూడా మరచిపోదాము. మనకు ఏమి చెప్పాడు అంటే దేవుడు ఏమి చేసినా గానీ, ఏమి చెప్పినా గానీ దానికి సంసిద్ధముగా ఉండడమే ముఖ్యము గాని, ఏమో నాకు చేతనైతే చేస్తాను లేకపోతే లేదు అనే విధముగా ఉండకూడదు. ఈ పద్ధతి చూస్తే ఇది అలాగే ఉంది. 50 ఉంటే 5కు తగ్గించుకుంటే అది ఏమి బాగుంటుంది? అందువలన మనము దీనిని కూడా మరచి పోదాము. దీనిని ఇతరులు విమర్శిస్తే మనము దానికి జవాబులు చెప్పలేము కాబట్టి ఇది కూడా మనకు ఆటంక యోగ్యముగా ఉంది. అంటే ఖురాన్ పవిత్రతకు భంగము కలిగేటట్లుగా ఉంది కాబట్టి దీనిని మనము తీసివేసి ఖుర్ఆన్‌లో చెప్పినట్లు అల్లాహ్‌యే అందరికీ దేవుడు అనుకుందాము. అల్లాహ్ ఏమి చెప్పితే అది చేస్తాము అనుకుందాము. అంటే దేవుడు ఏమి చెప్పినా చేసేదానికి సంసిద్ధముగా ఉండాలి. దేవుడు ఈ గంటలో నీవు చనిపో అంటే చనిపోయే దానికి సంసిద్ధముగా ఉండాలి. నీవు అందరినీ వదలిపెట్టు అని అంటే వదలిపెట్టేదానికి సంసిద్ధముగా ఉండాలి.

అదే బైబిల్‌లో ఏమి చెప్పినారో తెలుసా? దేవుని విషయములో నీ చేయి నిన్ను ఆటంకపరిస్తే నీ చేయిని తీసివేయి అన్నాడు. నీ కన్ను

www.thraithashakam.org

ఆటంకపరిస్తే కన్ను పెకలించివేయి అన్నాడు. ఆ విధముగా పోతే చేతులు, కాళ్ళు, కన్ను అన్ని అవయవాలనే మొత్తము తీసి ప్రక్కన పెట్టు అన్నప్పుడు మనము అన్నింటికీ సంసిద్ధముగా ఉండాలనే అక్కడ బోధించారు. నాకు చేతనయితే చేస్తాను లేకపోతే లేదు. అంటే కాళ్ళు వద్దులే ఇంకొకటి చిన్నది చెప్పు అని మనము అడుగుతామా? ఆ రకముగా ఆడగకుండా ముందే ఏమి చెప్పుతున్నాము అంటే ఇది మంచి పద్ధతి కాదు. దేవుని విషయములో అన్నిటికి మనము సంసిద్ధముగా ఉండాలి. కాబట్టి ఏ దానికి కూడా మనము వెనక్కిపోకూడదు అనేది మనము నేర్చుకోవాలంటే ఈ హదీసులను మనము మరిచిపోవడములో తప్పు ఏముంది? 7 లక్షల హదీసులలో వాళ్ళు 2000లకు వచ్చినప్పుడు మనము ఒక హదీసును ప్రక్కన పెట్టుకుందాము. దేవునికి ఆటంకము కదా! ఇది మరల ప్రశ్నార్థకము అవుతుంది కదా! దాంట్లో తప్పు ఏమి ఉంది? అంటే దేవుడు చెప్పినట్లు వినాలి అనేది మంచిది కాని అడుక్కుందాము అని పోయేది మంచిదా? కాదు నాకు చేతకాదు అని చెప్పడము మంచిదా? ఈ మాట కూడా మనకు ఇబ్బంది కలుగజేసే విధముగా ఉంది కాబట్టి మనము ఆ మాటను కూడా ప్రక్కన పెడుదాము.

తరువాత ఇంకొక మాట ఏమి అంటే జిబ్రయేల్, ముహమ్మద్ ప్రవక్తగారు వచ్చేటప్పుడు స్వర్గము, నరకము యొక్క స్థానాలు చూసినారు. స్వర్గాన్ని అనుభవించే వాళ్ళను చూసారు. నరకాన్ని అనుభవించే వాళ్ళను చూసారు. స్వర్గాన్ని, నరకాన్ని అనుభవించే వాళ్ళు అక్కడ కనిపించినప్పుడు అంటే వాళ్ళ యొక్క నరక బాధలు, స్వర్గ సుఖాలు చూసినప్పుడు మనకు తప్పకుండా ఒక్క ప్రశ్నవస్తుంది. ఎందుకంటే అప్పుడు ఇంకా ప్రవక్త ఉన్నాడు, మనుషులు ఉన్నారు. ప్రళయము రాలేదు. ప్రళయము చివర

రోజుల్లో మనుషులంతా సమాధి నుండి లేపబడుతారు. లేపబడినప్పుడు దేవుడు వచ్చి తీర్పు చెప్పుతాడు. అప్పుడు స్వర్గానికి నరకానికి పంపిస్తాడన్నప్పుడు వీళ్ళు ముందే స్వర్గానికి, నరకానికి ఎందుకు పోయినారు? ఎవరైనా ఇలా ప్రశ్నిస్తే మనకు ఇబ్బందే కదా! కాబట్టి వాళ్ళు స్వర్గము, నరకము ముందే చూసినారు అని చెప్పడము కూడా పొరపాటే, అంటే వీళ్ళను దేవుడు పంపించకనే ఎలా పోయినారు? అని ప్రశ్న వస్తుంది. అంటే దేవుడు చివరి దినాలలో కదా పంపించేది. ఇప్పుడు ఎలా పంపించినాడు? ఆయన పంపించకనే మనుషులు పోయారా అనే ప్రశ్న కూడా మనకు వస్తుంది. ఇటువంటి ప్రశ్నలు వేరేవాళ్ళు అడిగితే మనకు జవాబు చెప్పలేని పరిస్థితి ఉంది. కాబట్టి ఒక ముస్లీమ్ అడిగితే ఇంకొక పెద్ద ముస్లీమ్ ఈ ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోతున్నాడు. ఒక ముస్లీమ్ పిల్లవాడు అడిగితే వాళ్ళ ఇంట్లో తండ్రిగా ఉన్నటువంటి ముస్లీమే ఇటువంటి ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోతున్నాడు. కాబట్టి మీ పిల్లవాడు మీ ఇంట్లో అడిగితే జవాబు చెప్పలేని పరిస్థితిలో ఉన్నప్పుడు మీరు అటువంటి హదీసును బయటకు చెప్పవద్దండి. ఖుర్‌ఆన్ గురించి చెప్పండి లేకపోతే దేవుని పవిత్రతను కాపాడే విషయములను చెప్పండి. దేవునికి ప్రశ్నార్థకమైనటువంటి విషయాలు చెప్పవద్దండి.

హిందూమతములో ఇలాగ ఉన్నారు అని, భగవద్గీతలో తప్పులు, ఒప్పులు మీరు చెప్పవచ్చు. అటు పోయి ఇటు పోయి మరలా ఈ ఇస్లామ్ మతములో తప్పులు ఉన్నాయని చెప్పడము ఎందుకు అని కొందరు నన్ను అడుగవచ్చు. దానికి నా జవాబు, ఎవరికైనా గాని తప్పు తప్పే ఒప్పు ఒప్పే. ఇప్పుడు మనము ఏమి చెప్పుతున్నాము అంటే, ఇస్లామ్

www.thraithashakam.org

మతములో కూడా దేవుడు చెప్పినటువంటి వాక్యాలకు భంగము కలుగకుండా ఉండాలి అని అంటున్నాము. నేను సర్వులను సృష్ఠించినాను అని దేవుడు అక్కడ చెప్పినపుడు మరలా చివరిలో పాప, పుణ్యములను బట్టి తీర్పు చెప్పుతాను అన్నప్పుడు, సమాధుల నుండి చివరలో లేపుతాను అని అన్నప్పుడు వీళ్ళంతా ముందే స్వర్గము నరకాల్లో ఎందుకు ఉన్నారు అని మనము ప్రశ్నించుకుండేదానికి అవకాశము ఉంది. వేరేవాళ్ళు అడిగితే కూడా మన దగ్గర జవాబు లేదు. అందువలన మీరు ఏమి చేస్తారు అంటే, ఖుర్‌ఆన్ గ్రంథములో విషయాల మీదనే మీరు దృష్టి పెట్టుకోండి అని మేము ప్రత్యేకించి అందరికీ చెప్పుతున్నాము. ఇదేమిటి? మరలా భగవద్గీత విడిచిపెట్టి ఖుర్‌ఆన్ అంటున్నావే? అని అనుకోవద్దండి. మీరు భగవద్గీత చూసుకున్నా ఖుర్‌ఆన్ చూసుకున్నా అందరికీ దేవుని జ్ఞానము అర్థము అయ్యే విధముగా నేను చెప్పుతున్నాను. ఒకవేళ చేతనయితే బైబిల్ కూడా మీరు చూడండి. మేము భగవద్గీత చూసాము. అట్లే ఖుర్‌ఆన్ కూడా చూసాము. చేతనయింది కాబట్టి బైబిల్‌ని కూడా చూసినాము. చేతనయింది కాబట్టి అందరికీ తెలియని విషయాలు కూడా నేను తెలుసుకోగలిగినాను. చేతనయింది కాబట్టి ప్రశ్నిస్తున్నాను. చేతకాలేదు కాబట్టి చాలామంది చెప్పలేదు. కాబట్టి అటువంటి సంధర్భము రాకుండా మీరు అన్నీ చెప్పగలగాలి కదా! మీరు చెప్పే స్థోమతలో ఉన్నారా? ఇప్పుడు మీరు మిమ్ములను ప్రశ్నించుకొని చూసుకోండి. మీరు ప్రతి ప్రశ్నకు జవాబు చెప్పగలుగుతారేమో గుండెల మీద చేయి పెట్టుకొని చూసుకోండి. చెప్పగలుగుతారా? లేదు.

ఈ మధ్య విజయనగరము మీటింగ్‌లో కూడా నేను చెప్పినాను. అక్కడ నా దగ్గరికి కొంతమంది ముస్లీమ్‌లు వచ్చారు. నన్ను వాళ్ళ

మతములోనికి కలుపుకోవాలి అని అంటే లక్షణముగా కలసిపోతాను, నాకేమీ అభ్యంతరము లేదు. నాకు కొంత జ్ఞానము అర్థమయితే కదా! మతములో కలిసిపోయిన తరువాత ఎవరైనా అడిగితే నేను ఏమి చెప్పాలి? ముందు నాకు కొంత జ్ఞానము అర్థము కావాలి అన్నాను. అప్పుడు వారు ఏమి అర్థము కాలేదో చెప్పండి అన్నారు. నేను ఒక ప్రశ్న అడిగితే, వాళ్ళు గందరగోళపడి చివరకు ఇంటర్‌నెట్‌లో చూసి చెప్పుతాము అన్నారు. అప్పుడు నేను మీరు జవాబు చెప్పిన తరువాత చూస్తాము అని చెప్పి బయటకు వచ్చినాను. ఆ రకముగా మతపెద్దలయిన వాళ్ళు చెప్ప లేకపోయారు. అటువంటి పరిస్థితిలో వాళ్ళు ఉన్నారు. అందువలన మనము అలా కాకుండా అంటే మనము తెలుసుకోగలిగితే ఏదైనా తెలుసుకోవచ్చు. అందువలన మేము ఒక చిన్న ప్రశ్న అడిగితే దానికి జవాబు చెప్పలేని పరిస్థితి అందులో ఉంది. కాబట్టి అలా కాకుండా అటువంటి పరిస్థితి ఖుర్ఆన్ గ్రంథంలో రాకుండా ప్రతి వాక్యానికి అంటే ప్రతి ఆయత్‌కు జవాబు చెప్పే స్థోమత కల్గించాలి అంటే ప్రతి ఒక్క ముస్లీమ్ ఆ విధంగా తయారు కావాలనే ఉద్దేశ్యముతో మీ దగ్గర మీకు ఏమైనా తెలియని విషయాలు ఉంటే మమ్మల్ని అడగండి దానికి వివరము చెప్తాము. ఈ మతము, ఆ మతము అని మత బేధము పెట్టుకోవద్దండి. మీకు దేవుని విషయము కదా కావల్సినది! నాకు కూడా దేవుని విషయమే అవసరము. దేవుని విషయమును ప్రశ్నించండి మా ఖుర్ఆన్ గ్రంథములో ఇది ఉంది. దీని అర్థము ఏమి అని అడగండి తప్పక చెప్పుతాము. మా వాళ్ళు చెప్పలేని అర్థము మీరు చెప్పగలరా? అని అనుకోవద్దండి. మీ వాళ్ళే మీకు చెప్పలేకపోయినా దాని అర్థము నేను చెప్పుతాను అని చెప్పుతున్నాను. ఇక్కడ మీవాళ్ళు మావాళ్లు అని అనుకోకూడదు.

జ్ఞానము తెలిసినవాళ్ళు ఎవరైనా మీవాడే. కాబట్టి దేవుడు అందరికి ఒక్కడే. మీ దేవుడు, మా దేవుడు అని వేరు వేరుగా లేడు, మీ జ్ఞానము, మా జ్ఞానము ఏమిటి? అంతా ఒకటే జ్ఞానమే. కాబట్టి మేము ఏ జ్ఞానానికైనా జవాబు చెప్పుతాము. అది మా జ్ఞానమే! దేవుడు అందరికీ ఒక్కడే. అటువంటప్పుడు ఏముంది? మేము అన్నిటికీ సమాధానము చెప్పుతాము కదా! అందువలన **ఖురాన్‌లోని జ్ఞానవాక్యములు** అనే పేరుపెట్టి ఒక గ్రంథము, **అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు** అను పేరుతో మరొక గ్రంథము కూడా వ్రాశాము. అది మామూలుగా "ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ" కి ఆ గ్రంథాలను అందజేయాలనుకున్నాము. ఆ గ్రంథములతో వాళ్ళు ముందుకు పోవాలనుకున్నారు. ఇప్పుడు మీకు చెప్పడము ఏమి అంటే ఖుర్ఆన్ వేరు, హదీసులు వేరు. హదీసులకంటే ఖుర్ఆన్ గొప్పది. ఖుర్ఆన్‌లో విషయాలు మీరు తెలుసుకోండి. ఎక్కడైనా హదీసులలో ఏదైనా పొరపాటు ఉంటే వాటిని విడిచిపెట్టండి. అయితే ఖుర్ఆన్‌లో ఒక దానిని కూడా వదలిపెట్టవద్దండి. 7 లక్షల హదీసులలో వాళ్ళు రెండువేలకు వచ్చినారు. 7 లక్షల హదీసులను వ్రాసినవాళ్ళే అన్నిటినీ కాదుయని చివరకు రెండు వేలు ముఖ్యము అని అన్నారు. ఎప్పుడో ప్రవక్తగారు పరమపదించిన తరువాత 120 సం॥ల తరువాత చెప్పు కున్నటువంటి విషయాలు మనకు ఎంత స్వచ్ఛతను ఇస్తాయో మనము చెప్పలేము,

కానీ ఆ రోజు ప్రవక్త గారు ఉన్నప్పుడే కొందరు తప్పు చేస్తూ ఉంటే వారికి ప్రవక్త గారు చెప్పినమాటలే అర్థము కాకుండా ఉంటే, "ఇది తప్పు, ప్రవక్తగారు ఈ విధముగా చెప్పలేదు. ప్రవక్త గారు చెప్పినటువంటిది మీరు సరిగా అర్థము చేసుకోలేదు. ప్రవక్తగారు చెప్పనటువంటి భావము

ఇది. ఈ భావము ప్రకారము మీరు నడుచుకోకుండా వేరే భావముతో నడుచుకుంటున్నారని" ప్రవక్త ఉన్న రోజులలోనే, ప్రవక్త భార్య అయిన ఆయేషాగారు చెప్పారు. ఆ రోజు ప్రవక్త గారు ఉన్న రోజులలోనే వాళ్ళకు అర్థము కానప్పుడు ప్రవక్త పోయిన తరువాత కొన్ని సంవత్సరములకు అది నిజము ఎంతో, అబద్ధము ఎంతో హదీసులను వ్రాసుకొని దానినే సత్యముగా చెప్పుకుంటే మన జ్ఞానమునకు ఇబ్బంది కలుగుతుంది కాబట్టి వాటిలో అన్నీ పనికి రావు అని నేను చెప్పలేదు. కొన్ని పనికి రానివి ఉన్నాయి. వాటిని తీసివేయవచ్చు, కానీ ఖుర్ఆన్ గ్రంథములో అలా కాదు ప్రతి వాక్యము పనికి వచ్చేదే. అన్ని వాక్యములకు నేను వివరము చెప్పలేదు. ఎందుకంటే దేవుడు చెప్పిన అన్ని వాక్యాలకు వివరము చెప్పేదానికి మనకు చేతకాదు. మనము కొన్ని వాక్యాలకు మాత్రమే వివరము చెప్పగలుగుతాము. మేము ఏమి చెప్పుతున్నాము అంటే దేవుడు చెప్పిన అన్ని వాక్యములకు దేవుడే సమాధానము చెప్పాలి. దేవుడు ఎటువంటి వాడు అని చెప్పేదానికి ఏ మనిషితోను కాదు. మనము చూచాయగా కొన్ని విషయములు చెప్పుకోవచ్చు. కాబట్టి దేవుని విషయాలు దేవుడే చెప్పాలి. ఖుర్ఆన్ వాక్యములలో ఏ వాక్యమును తీసివేసేదానికి కాదు. కానీ అన్ని వాక్యములు మనకు తెలియవు. కొన్ని వాక్యముల గురించే మనము వ్రాసుకోగలుగుతాము, కానీ అన్ని వాక్యముల గురించి మేము వ్రాయలేము. అందువలన మేము కొన్ని వాక్యములకే వివరమును వ్రాయగలిగాము. అవి జ్ఞాన వాక్యములు, వజ్రవాక్యములు అను రెండు పేర్లతో ఉన్నాయి. ఖుర్ఆన్ గ్రంథము గొప్పది ఆ ఖుర్ఆన్ వాక్యములే మేము ముఖ్యముగా కొన్నింటిని వ్రాశాము. ఖుర్ఆన్ తర్వాత హదీసులు రెండవది. కాబట్టి హదీసులలో నీవు కొన్ని తీసివేసుకోవచ్చు.

www.thraithashakam.org

ఖురాన్ గ్రంథములో జ్ఞానము ప్రకారము నడుచుకొనే దానికి, ఆటంకము కలుగకుండా ఉండేదానికి హదీసు గ్రంథములో కొన్నిటిని వదిలిపెట్టినా ఫరవాలేదు. కానీ ఖుర్ఆన్ గ్రంథములో వదిలిపెట్టేదానికి అవకాశము లేదు. నీకు అర్థము కాకపోతే కొన్ని చెప్పుకో, కొన్ని వదలిపెట్టు ఎవరినైనా అడిగి తెలుసుకో ఫరవాలేదు. అంతేగాని ఏ ఒక్కటి కూడా తీసివేసేదానికి కాదు. అందువలన పవిత్రమైన ఖుర్ఆన్ గ్రంథములో దేవుని ధర్మము ఉంది. ప్రవక్తగారి జ్ఞానము ఉంది. మనుషులము అయినటువంటి మనము దేవుని జ్ఞానమును ఆచరించాలనే ఉద్దేశ్యముతో చెప్పుచున్న దేమనగా! పవిత్ర ఖుర్ఆన్ గ్రంథములో ధర్మము దేవునిది, జ్ఞానము ప్రవక్తది, ఆచరణ మనుషులది. కాబట్టి మనము ఆచరించే దానికి ప్రయత్నము చేయాలి. రెండో విధానము మనకు వద్దు. అందువల్ల ఖురాన్ గ్రంథములో ఉండేటటువంటి విషయాలను ప్రతి ముస్లీమ్ తెలుసుకొని అందులో సారాంశమును గ్రహించుకోవాలి. మీరు ఊరక చదవడము ముఖ్యము కాదు. ప్రతి వాక్యములో ఉండే సారాంశమును తెలుసుకొని, దాని ఆచరణ ఏ విధముగా చేయాలనే ఉద్దేశ్యముతో మీరు ఆచరించగలిగితే దేవునికి దగ్గరగా పోవచ్చు. అల్లాహ్ దగ్గరకు మీరు చేరుకోవచ్చు. ఈ జన్మలోనే చేరుకోవచ్చు. అందువలన ప్రతి ఒక్కరు అదే ప్రయత్నము చేయండి. ఖుర్ఆన్ యొక్క స్వచ్ఛమైనటువంటి వివరాలను తెలుసుకోండి. అల్లాహ్ దగ్గరకి పోయేదానికి ప్రయత్నము చేయండి.

ఇంకా కొందరు ముస్లీమ్ పండితులు ఖుర్ఆన్‌నే ముఖ్యము, హదీసులు ముఖ్యము కాదు అని అంటున్నారు. అంతేకాక ప్రవక్తగారు

www.thraithashakam.org

బ్రతికి ఉన్నప్పుడు హదీసులను వ్రాయదలచినవారిని మందలించి అది తప్పు దేవుని గ్రంథము ఒక్కటే మనుషులకు అవసరము. కావున ఎవరూ హదీసులను వ్రాయకూడదు అని చెప్పారు. ఆ విషయములను సేకరించి క్రింద పొందుపరుస్తున్నాము చూడండి.

## హదీసుల చరిత్ర

- ♦ **ఎప్పుడు ఎందుకు వ్రాశారు.**
- ♦ **ముహమ్మద్ ప్రవక్త హదీసులు వ్రాయడము నిషేదించారు.**

ముహమ్మద్ ప్రవక్త హదీసులు వ్రాయడము నిషేధించాడు. నేడు మన దగ్గరవున్న అన్ని హదీసులు, వేటిని హదీసు పండితులు నిర్ధారించారో, అవి అన్నియు ప్రవక్త మరణించిన 200 సంవత్సరాల తరువాత వ్రాసినవి. 200 సంవత్సరాల వరకు ప్రవక్త విధించిన నియమాల వలన, ఏ హదీసు గ్రంథమూ నిర్ధారింపబడి వ్రాయబడి లేదు. నేడు మనవద్ద ఉన్న షాహీ సేకరణలు (హదీసులు) రచించిన బుఖారి కూడా హిజ్రా (870) తరువాత 194 సంవత్సరాలకు జన్మించాడు. మిగతా 6 హదీసుల రచయితలు కూడా బుఖారి జన్మించిన తరువాత జన్మించారు.

ఖుర్ఆన్, హదీసు కల్పితం గురించి చెప్తుంది. అది ప్రవక్త యొక్క శత్రువుల చేత కల్పించబడుతుంది. 6వ సూరా, 112 వ ఆయత్ (6–112) మేము ప్రతి ప్రవక్తకు, మానవునికి, జిన్నులకి శత్రువులని తయారు చేశాము. ఒకరినొకరు ప్రేరేపించటానికి ఆకర్షణీయ మాటలు మోసం చేయటానికి దేవుడు తలచియుంటే వారు అలా చేసేవారు కాదు. మీరు హదీసులను వదిలివేయాలి, వారు కల్పించినవి.

www.thraithashakam.org

ఖుర్ఆన్ కూడా నిర్ధారిస్తుంది అది దేవుని యొక్క ఇష్టముతోనే హదీసుల కల్పన (తయారు చేయుట) అనుమతించబడింది. ఇది ఒక ఖుర్ఆన్ సూత్రము ప్రకారము, దుర్మార్గులని మరియు విశ్వాసులని వేరు చేయటానికి. ఎవరు హదీసులని ఆచరిస్తారో వారు అసత్య విశ్వాసులు అని నిర్ధారించబడింది. నిజమైన విశ్వాసులు దేవునితో మాత్రమే సంతృప్తి చెందుతారు. వారు దేవుని మాటలతోనే సంతృప్తి చెందుతారు, ఇంకా దేవుని ధర్మంతో (ఖుర్ఆన్‌తో) మాత్రమే తృప్తి పడతారు. వారు దేవుని యొక్క మాటలనే విశ్వసిస్తారు, ఏవి ఖుర్ఆన్ సంపూర్ణం మరియు వివరణాత్మకం అని వర్ణిస్తాయో వాటినే నమ్ముతారు. కావున వారికి వేరే ఇంకేవీ అవసరము లేదు.

(6-114, 115) "నేను దేవుడిని వదలి వేరే మరో తీర్పరిని అన్వేషించాలా? అసలు ఆయనే కదా! పూర్తి వివరాలతో ఈ గ్రంథాన్ని పంపినవాడు". నీకు పూర్వం గ్రంథము ఇవ్వబడినవారికి నీ ప్రభువు నుండే సత్యపూరితమైన ఈ గ్రంథము కూడా అవతరించిందని తెలుసు. కనుక నీవు అవమానించేవారిలో చేరిపోకు. నీ ప్రభువు వాక్కు సత్యం, న్యాయాల దృష్ట్యా స్వచ్ఛమైనది, సమగ్రమైనది. ఆయన వచనాలను ఎవరూ మార్చలేరు. ఆయన సమస్తం వింటున్నాడు, సర్వం ఎరిగినవాడు.

వారు దేవుని ఆజ్ఞని పాటిస్తారు ఖుర్ఆన్ తప్ప ఏ హదీసుని ఆచరించకూడదు అని.

(45-6) ఇవి దేవుడు తెలియజేసిన విషయాలు, వీటిని మేము మీకు సత్యముగా చెప్పుచున్నాము. దేవుడు మరియు దేవుని సందేశములు కాకుండా వారు ఏ హదీసుని విశ్వసిస్తున్నారు? (దేనిని విశ్వసించరు.)

వారు దేవుని ఆజ్ఞని పాటిస్తారు ఖుర్ఆన్ తప్ప ఏ హదీసుని ఆచరించకూడదు అని అంటారు.

మరొక ప్రక్క, అసత్య విశ్వాసులు ధర్మానికి ఆధారమైన ఖుర్ఆన్‌తో సంతృప్తి చెందలేదు, అందుకే వారు ఇతర (హదీసు) గ్రంథాల కోసము చూస్తున్నారు.

(6-113) పరలోకం నమ్మనివారి హృదయాలు గలవారు సహజము గానే మనుషులు చెప్పిన తియ్యటి మాటలు వినటానికి మొగ్గు చూపుతాయి. అందువలన వారు లోగడ చేస్తూ వచ్చిన కార్యాలే ఇప్పుడూ చేస్తున్నారు.

హదీసు గ్రంథము చెప్పుచున్నది, ప్రవక్త తన హదీసు వ్రాయటం నిషేధించాడు అని. ఇంకా అతని అనుచరులకు కూడా ఖుర్ఆన్ తప్ప వేరే గ్రంథము వ్రాయకూడదు అని ఆదేశించాడు! ప్రవక్త తాను చెప్పిన దానిని తాను చనిపోయే అంతవరకు ఆచరించాడు. క్రింద అటువంటి హదీసులను చూడండి.

1) ఇబ్న్ సయీద్ అల ఖుద్రి ఇలా నివేదించాడు, దేవుని దూత (జిబ్రయేల్) ఇలా చెప్పాడు.

“నా నుంచి వచ్చిన ఖుర్ఆన్ తప్ప ఇతరము వ్రాయకండి. ఎవరైనా ఖుర్ఆన్ తప్ప ఇతరము వ్రాసివుంటే వాటిని చెరిపేయాలి”. (అహ్మద్ సం 1, పేజీ 171 మరియు షాహీ మొస్లిం, జుహాడ్, బుక్ 42, నెంబర్ 7147)

కొంతమంది హదీసు పండితులు ముహమ్మద్ హదీసులు వ్రాయటం గురించి తన మనుసు మార్చుకున్నాడు అని చెప్పారని ప్రయత్నం చేశారు. కానీ, క్రింద చెప్పబడిన హదీసులు ప్రవక్త చనిపోయిన చాలా సంవత్సరాలు తరువాత వ్రాసినవి, ముహ్మద్ ప్రవక్త ఏనాడూ హదీసులను వ్రాయటం

అనుమతించలేదు, తాను తన అనుచరులకు హదీసులని వ్రాయవద్దు అని చెప్పిన తరువాత అని నిర్ధారిస్తున్నాయి.

ఇబ్న్ హంబల్ :

2) జాయిద్ ఇబ్న్ తబిత్ (ప్రవక్త దగ్గరి అనుచరుడు మరియు ఖుర్ఆన్ రచయిత) ఖలీఫాము ఆవియాను (ప్రవక్త మరణించిన 30 సంవత్సరాలు తరువాత) కలుసుకున్నాడు, మరియు అతనికి ప్రవక్త గురించి ఒక కథ చెప్పాడు. ము ఆవియాకి ఆ కథ నచ్చింది. ఇంకా ఆ కథను రచించమని చెప్పాడు. కానీ జాయిద్ అన్నాడు **"దేవుని దూత మాకు ఎప్పుడూ తన హదీసు వ్రాయమని ఆజ్ఞాపించలేదు".**

3) ప్రఖ్యాత పుస్తకము "ఉలూమ్ అల్ హడిత్" ఇది ఇబ్న్ అల్ సలహా చేత వ్రాయబడినది. ఇది అబూ హురాయ చెప్పిన హదీసుని నివేదిస్తుంది. అందులో అబూ హురైరా ఇలా చెప్పాడు "మేము హదీసులని వ్రాస్తున్నప్పుడు ప్రవక్త మా దగ్గరికి వచ్చి మీరు ఏమి వ్రాస్తున్నారు? అని అడిగారు. మేము చెప్పాము "ఓ ప్రవక్తా! మీ నుండి విన్న హదీసులని వ్రాయుచున్నాము". ఆయన ఇలా అన్నాడు "ఏమిటీ? దేవుని గ్రంథము కాకుండా ఇంకొకటా? అన్నప్పుడు మేము అన్నాము "నీ గురించి మనము మాట్లాడుదామా?" అతను (ప్రవక్త) అన్నాడు "నా గురించి మాట్లాడండి అది మంచిది, కానీ అబద్ధం చెప్పేవారు నరకానికి పోతారు". అబూ హురైరా చెప్పాడు, మేము వ్రాసిన అన్ని హదీసులని సేకరించి వాటిని అగ్గిలో కాల్చివేశాము.

4) ప్రఖ్యాత గ్రంథము "తక్–ఈద్ అల్–ఇల్మ్"లో అబూ హురైరా ఇలా చెప్పాడు. కొంతమంది హదీసులని వ్రాస్తున్నారు అని ప్రవక్తకు తెలిసినది. ప్రవక్త మస్జీద్‌లోని వేదిక వద్దకు తీసుకొనిపోయాడు, ఇంకా

ఇలా అన్నాడు. "మీరు వ్రాశారు అని నేను విన్న ఈ గ్రంథాలు ఏమిటి?" "నేను కేవలం ఒక మనిషిని. ఇలా వ్రాసినవి ఇంకా ఎవరి వద్దయినా ఉంటే వాటిని ఇక్కడకు తీసుకురండి అన్నాడు. అప్పుడు అబూ హురాయ చెప్పాడు, మేము వాటిని సేకరించి అన్నిటినీ అగ్గిలో కాల్చివేశాము.

5) ఇబ్న్ హంబల్ తన గ్రంథము ముస్నాద్‌లో ఒక హదీసుని ఇలా చెప్పాడు. అందులో అబ్దుల్లాహ్ ఇబ్న్ ఒమర్ ఇలా చెప్పాడు. ప్రవక్త ఒక రోజు మా వద్దకు తాను త్వరలో చనిపోవువానివలె వచ్చాడు మరియు ప్రవక్త ఇలా చెప్పాడు. "నేను వెళ్లిపోయిన (చనిపోయిన) తరువాత దేవుని గ్రంథానికి కట్టుబడి ఉండండి. అది దేనిని నిషేధిస్తుందో దానిని నిషేధించండి మరియు అది దేనిని హలాల్ చేసిందో దానిని హలాల్‌గా స్వీకరించండి".

6) ఇంకా "తక్–ఈద్ అల్–ఇల్మ్" లో అబూ సయీద్ అల్–ఖుద్రీ ఇలా చెప్పాడు. "నేను ప్రవక్తను అతని హదీసుని వ్రాయటానికి అనుమతి అడిగాను, కానీ ఆయన అనుమతి ఇవ్వటానికి నిరాకరించాడు".

7) ప్రవక్త యొక్క వీడ్కోలు యాత్ర ముస్లీమ్ చరిత్రలో ఒక మైలురాయి. ఈ యాత్రలో ప్రవక్త ఇచ్చిన తన చివరి ప్రసంగమును ఎన్నో వేలమంది ముస్లీమ్‌లు వీక్షించారు. కానీ ఈ ప్రసంగం హదీసు గ్రంథాలలో మూడు విధాలుగా ఉన్నది. ఈ ఒక్క విషయమే హదీసు గ్రంథాలు ఎంతమేర అస్థిరంగా (ఒకే విధానం కాకుండ) ఉన్నాయో చూపిస్తుంది. ఎందుకంటే ప్రవక్త యొక్క చివరి ప్రసంగం ఎంతోమంది చూచినది.

**1. మొదటి రకము.** "నేను మీకు వదిలిపెట్టాను, దేనిని మీరు పట్టుకుంటే, మీరు ఎప్పటికీ అపమార్గం పట్టించబడరు. దేవుని యొక్క

www.thraithashakam.org

గ్రంథము మరియు నా కుటుంబం. మొస్లిం 44/4, Number 2408, ఇబ్న్ హంబల్ 4/366, దరిమి 23 / 1, Number 3319.

ఈ మాటలు ఒక రకము. వీటిని షియా ముస్లీమ్స్ నిర్ధారిస్తారు.

**2. రెండవ రకము** "నేను మీ కొరకు విడిచిపెట్టాను దేనిని మీరు పట్టుకుంటారో, మీరు ఎప్పటికీ అపమార్గం పట్టించబడరు. దేవుని గ్రంథము మరియు నా సున్నహ్ (సంప్రదాయము / విధానము) – మువాత, 46/3.

ఈ రకము మాటలని సున్ని ముస్లీమ్స్‌వారు నిర్ధారిస్తారు.

**3. మూడవ రకము** "నేను మీ కొరకు విడిచిపెట్టాను దేనిని మీరు పట్టుకుంటే, మీరు ఎప్పటికీ అపమార్గం పట్టించబడరు. దేవుని గ్రంథము." మొస్లీం 15/19, Nu 1218, ఇబ్న్ మజ 25/84, అబూ Dawud 11/56.

ఈ మూడవ రకం మాటలని సున్ని, షియా ముస్లీమ్స్ ఇద్దరూ ఒకే రకంగా ద్వేషిస్తారు. ఈ మూడవ రకము మాత్రమే ముహమ్మద్ సందేశము మాత్రమే ఖురాన్ అని మళ్లీ మళ్లీ ఎన్నోసార్లు చెప్పిన మాటలని నిర్ధారిస్తుంది. చాలామంది సున్ని, షియా ముస్లీమ్‌లకు ఈ మూడవ రకం ఉందని కూడా తెలియదు. వాస్తవానికి వారు దానిని తెలుసు కోవాలనుకోలేదు. ఎందుకంటే నిజము కఠినంగా ఉంటుంది.

## హదీసు గ్రంథములు వ్రాయుట యొక్క చరిత్ర :

దేవుడు మళ్లీ మళ్లీ నిర్ధారించాడు ఖుర్‌ఆన్ సంపూర్ణ గ్రంథము అని, ఖచ్చితమైనది మరియు పూర్తిగా వివరించబడినది అని (6–19,38, 114, 115; 50–45, 12–111) మరియు, ఒకవేళ అవసరంగా ఉంటే ఆయనే (దేవుడు) మనకి వందల గ్రంథాలను ఇచ్చేవాడు, ఒక్క ఖుర్‌ఆన్ గ్రంథము మాత్రమే కాదు (చూడండి 18–109, 31–27).

www.thraithashakam.org

## హడిత్ మరియు ఖైఫాస్ అల్–రాషిదీన్ (గైడెడ్ ఖైఫాస్)

ప్రవక్త మరణించిన తరువాత ముస్లీమ్ ఉమ్మ (దేశం) ని పాలించిన నలుగురు నడిపించబడిన ఖైఫాలు మహ్మద్ ప్రవక్త యొక్క ఆదేశాన్ని గౌరవించి హదీసులని వ్రాయటం ఖండించారు. మరియు అప్పటికే ఉన్న వాటిని నిషేధించారు. వారు ఖుర్ఆన్ పూర్తిగా వివరించబడింది అనే విషయాన్ని స్వీకరించారు మరియు అది మాత్రమే మతానికి ప్రజలకు మూలము అని (6–114). అబూ బకర్‌కి ఒకానొక సమయంలో నిర్ధారించుకోలేకపోయాడు తనకు తెలిసిన హదీసులను ఉంచాలో, ఉంచకూడదో అని. ఎంతోకాలం ముహమ్మద్ ప్రవక్తతో కలిసివున్న సమయంలో అతను (అబూ బాకర్) 500 హదీసులని సేకరించాడు, కానీ తాను వాటిని కాల్చే వరకు రాత్రి నిద్రించలేదు. ఒమర్ ఇబ్న్ అల్–ఖత్తాబ్ తన కొడుకు అబ్దుల్లాహ్ సేకరించిన హదీసులని నాశనం చేయాలని పట్టుబట్టాడు. ఇస్లామ్ చరిత్ర ఒమర్ ఇబ్న్ అల్–ఖత్తాబ్ ప్రవక్త యొక్క నలుగురు అనుచరులకు దూరంగా ఉండే చరిత్రని చెప్పుచున్నది. ఎందుకంటే, వారు హదీసులని చెప్పాలని పట్టుబట్టారు. ఆ నలుగురు అనుచరులు ఇబ్న్ మసూద్, అబూ అల్–దర్దా, అబూ మసూద్ అల్–అన్సారీ మరియు అబూ తర్అల్–గఫ్ఫారీ. ఒమర్ (పిలిచాడు) అబుహురాయరాని అబద్దాలకోరు అని అన్నాడు మరియు ప్రవక్త గురించి అబద్దాలు చెప్పటం ఆపకపోతే తను (అబూ) ఎక్కడికి నుండి వచ్చాడో (యెమెన్) అక్కడికి తిరిగి పంపుతానని అబూని బెదిరించాడు. అతను ఒమర్ మరణించే వరకు ఊరికే ఉన్నాడు. తరువాత మళ్లీ మొదలు పెట్టాడు.

ఒమర్ కూడా ఇలా నివేదించాడు అని చెప్పబడి వుంది. ఏమిటంటే అతను ప్రవక్త మాట్లాడిన వచనాలను వ్రాయాలని కోరుకున్నాడు, కానీ

www.thraithashakam.org

ముస్లీమ్స్ ఖుర్‌ఆన్‌ని వదలి హదీసులని స్వీకరిస్తారేమో అని భయపడి వాటిని వ్రాయటం మానుకున్నాడు.

"నేను సున్నహ్ వ్రాయాలని కోరుకున్నా, మరియు నేను జ్ఞాపకం తెచ్చుకున్నా నీకంటే ముందు వున్న ప్రజలు గురించి, వారు గ్రంథాలను రచించారు. వాటిని అనుసరించడానికి మరియు దేవుని గ్రంథాన్ని వదలి పెట్టటానికి. మరియు నేను ప్రతిజ్ఞ చేస్తున్నా నేను ఎప్పుడూ కానీ దేవుని గ్రంథాన్ని వేరొక గ్రంథముతో మార్చాను అని "జమి అల్–బయన్ 1/67 అలీ ఇబ్న్ అబూ తాలిబ్, నాలుగవ ఖలీఫా తన ప్రసంగాలలో ఒక దానిలో ఇలా చెప్పాడు. "ఎవరెవరు ప్రవక్త నుండి వ్రాతలను తీసుకున్నారో వారినందరినీ అర్థిస్తున్నాను, మీరు ఇంటికి పోయి వాటిని చెరిపేయండి. మీకంటే ముందు ప్రజలు నాశనం చేయబడ్డారు. ఎందుకంటే వారు పండితులు వ్రాసిన హదీసులను అనుసరించి మరియు వారికి దేవుడు ఇచ్చిన గ్రంథాన్ని వదలిపెట్టారు" (సునన్ అల్–ధరామి).

## ఖలీఫా ఒమర్ ఇబ్న్ అబ్దుల్ ఆజిజ్, అంత్యము యొక్క మొదలు.

అబూ హురైరా అందరికంటే ఎక్కువగా ఎవరూ చెప్పనన్ని హదీసులని చెప్పాడు. ఇంకా ప్రవక్తతో కలిసి వారి జీవితాంతం జీవించిన అబూ బాకర్, ఒమర్ అలీ మరియు ఆయిషా వారికంటే కూడా ఎక్కువ హదీసులు చెప్పాడు. కేవలం రెండు సంవత్సరాలకంటే తక్కువ సమయం ప్రవక్తతో కలిసి వున్న సమయములో అతను ప్రవక్త అనుచరులు అందరూ వ్రాసిన హదీసులకంటే ఎక్కువ హదీసులు వ్రాశాడు. అతను మొత్తము 5374 హదీసులు చెప్పాడు. ఇబ్న్ హంబల్ మొత్తం 3848 హదీసులను తన గ్రంథములో చెప్పాడు. ప్రవక్త మరణించిన తరువాత ముస్లీమ్ దేశాన్ని పాలించిన నడిపించబడిన ఖైపాలు ఖుర్‌ఆన్ తప్ప వేరే ఏదీ వ్రాయకూడదు

అను ప్రవక్త కోరికను గౌరవించి మరియు, హదీసులు మరియు సున్నాహ్ వ్రాసే ఎటువంటి ప్రయత్నం అయినా తప్పు అని చెప్పారు. (ఖండించారు / నిషేధించారు.)

వారు సూచించిన పద్ధతిని ప్రవక్త మరణించిన రెండు వందల సంవత్సరాల వరకు పాటించారు. ఆ సమయానికే, ప్రవక్త గురించి అబద్దాలు వ్యాప్తి చెందాయి మరియు ప్రజలు హదీసుల కోసం ఖుర్ఆన్‌ను వదలిపెట్టారు. అటువంటి ఆ సమయములో ఖలీఫా ఇబ్న్ అబ్దేల్-ఆజిజ్, హదీసులు మరియు సున్నాహ్ వ్రాయటానికి అనుమతి ఆదేశాన్ని ఇచ్చారు, ఎందుకంటే దానివలన కేవలం వాస్తవ హదీసులు మాత్రమే రికార్డు చేయబడతాయి మరియు అవి అసత్యాలకి ముగింపు చేస్తాయి అని ఆలోచించి ఖలీఫా ఆ నిర్ణయం తీసుకున్నారు. అతని పాలనలో, అతను ఖుర్ఆన్‌లోని దేవుని ధర్మాలని మరియు ప్రవక్త నియమాలను ఇంకా అతనికంటే ముందు ప్రజల ఉదాహరణలను మరియు అతని కాలములోని ఎంతోమంది పండితుల అభ్యంతరాలను నిరాకరించాడు. అప్పటినుండి దేవుని మతం అయిన ఖుర్ఆన్ నుండి, ఇస్లామ్ హదీసులు సున్నాహ్‌ల మీదికి వెళ్ళింది, వేటిని (హదీసులను, సున్నాహ్‌లను) దేవుడు ఆయన ప్రవక్త వాస్తవానికి నిషేధించారో, వాటి మీదికే ఇస్లామ్ మతం వెళ్ళింది.

## హదీసుల మొదటి వ్రాతలు :-

చరిత్ర ప్రకారము హదీసులు ప్రవక్త ఉన్న కాలములోనే వ్రాశారు అనేది వాస్తవము, కానీ ప్రవక్త మరియు అతని తరువాత పాలించిన వారు ఈ వ్రాతలను (హదీసులని) ఖండించారు, నాశనం చేశారు. మరియు హదీసులని వ్రాసిన వారిని అవమానకరంగా చూశారు. హదీసు గ్రంథాలు ఇలా చెప్పాయి, మహ్మద్ ప్రవక్త, సేకరింపబడిన అన్ని హదీసులని

కాల్చివేశాడు. మరియు “ఖుర్‌ఆన్‌తో పాటు ఇంకొక గ్రంథము తయారు చేసినందుకు” వారిపట్ల కోపోద్రిక్తుడు అయినాడు. అబూ బాకర్ మరియు ఇబ్న్ అల్–ఖత్తాబ్ కూడా సేకరించిన హదీసులు అన్నిటినీ (కలెక్షన్స్) కాల్చి వేయాలని ఆజ్ఞాపించబడ్డారు.

ఈ హదీసుల నిషేధం అలానే కొనసాగింది ఒమర్ అబ్దేల్–ఆజిజ్ హదీసులు వ్రాయటానికి అనుమతి ఇచ్చేవరకు, అప్పుడు చాలా గ్రంథాలు మరియు (కరారీస్) హదీసులు కలిగినవి వచ్చాయి, ఉదాహరణకు ఇబ్న్ గ్రీగ్, మాలిక్ ఇబ్న్ అనాస్, మహమ్మద్ ఇబ్న్ ఇషాక్. వీటన్నిటిలో అత్యంత ప్రఖ్యాతమైనది మాలిక్ ఇబ్న్ అనాస్ యొక్క గ్రంథము (అల్–మువాత్తా) అది దాదాపు 500 హదీసులు కలిగియుంది. రెండవ శతాబ్దం చివరిలో మాసానిద్ అనే గ్రంథాలూ వచ్చాయి. ఉదాహరణకు అహ్మద్ ఇబ్న్ హంబల్ యొక్క మస్నాద్ గ్రంథము ఇది 40,000 హదీసులు కలిగివుంది. మూడవ శతాబ్దం మొదటి 50 సంవత్సరాలలో ప్రఖ్యాత ఆరు హదీసు గ్రంథాలు తయారైనాయి మరియు వీటిని నేటి ఎంతోమంది పండితులు ఉపయోగిస్తున్నారు. 1) షాహీ బుఖారీ, 2) షాహీ మోస్లేమ్, 3) సునన్ అబూ దావుద్, 4) సునన్ అల్–టెర్మితే, 5) సునన్ అల్–నేసెయ్, 6) సునన్ ఇబ్న్ మగెహ్.

ఈ గ్రంథాలలో ఒక క్రొత్త మతము వ్రాయబడి అది ఖుర్‌ఆన్ మీద అధిపత్యం వహించింది. అది ప్రకటించిన విషయానికి వ్యతిరేఖంగా (అంటే అవి తమకు తాము ఖుర్‌ఆన్‌కంటే తక్కువ అని చెప్పిన దానికి) ఈ గ్రంథాలు వ్రాయటంలో రచయితలు, హదీసులు ఖుర్‌ఆన్‌కి వ్యతిరేఖంగా వున్నా లేక ఇతర హదీసులకు వ్యతిరేఖంగా వున్నా లేక సాధారణ విచక్షణ లేకున్నా వాటిని పట్టించుకోలేదు. వాస్తవానికి అవి 6–112, 113లో చెప్పిన దేవుని ప్రతిజ్ఞని నెరవేర్చాయి.

www.thraithashakam.org

(6–112, 113) అదే విధముగా మేము పైశాచిక స్వభావం గల మానవుల్ని, జిన్నులనీ, ప్రతి దైవ ప్రవక్తకు శత్రువులుగా చేశాము. వారు ఆత్మ వంచనతో పరస్పరం మనోహరమైన మాటలు చెప్పుకుంటారు. అలా చేయకూడదని ముందే నీ ప్రభువు నిర్ణయించి ఉంటే వారలా ఎన్నటికీ చేయరు. కనుక వారు అలాగే తియ్యటి మాటలతో (హదీసులతో) ఒకరినొకరు మోసగించుకొనేలా వారి మానాన వారిని వదిలిపెట్టు. పరలోకాన్ని విశ్వసించినవారి హృదయాలు సహజంగానే తియ్యటి మాటల వైపు మొగ్గుతాయి. అవంటేనే వారికి ఇష్టం. (యదార్థం వారికిప్పుడు చేదుగానే ఉంటుంది.) అందువలన వారు (యదార్థము తెలిసినప్పటికీ) లోగడ చేస్తూ వచ్చిన (దుష్ట) కార్యాలే ఇప్పుడూ చేస్తున్నారు.

## ఎన్ని హదీసులు :-

సేకరించిన హదీసులు మరియు ప్రవక్త ముహమ్మద్‌కి సంబంధించినవి వందల వేలు, దాదాపు 7,00,000. వీటిలో చాలావరకు పచ్చి అబద్ధాలు మరియు కల్పితాలు మరియు ఏ ముస్లీమ్ పండితులు హదీసులు ఏవి సత్యము, ఏవి సత్యము కాదో చెప్పగలిగే వారిచేత నిరాకరించ బడినవి. ఇప్పుడు మనము కొంతమంది ప్రఖ్యాత హదీసు సేకరణకర్తలు మరియు వారు సేకరించినవి చూస్తాము.

1) మాలిక్ ఇబ్న్ అనాస్ దాదాపు 500 హదీసులని తన ప్రఖ్యాత గ్రంథం "అల్–మువాత్తా" లో సేకరించాడు.

2) అహ్మద్ ఇబ్న్ హంబల్ దాదాపు 40,000 హదీసులని తన ప్రఖ్యాత గ్రంథము "ముస్నాద్"లో సేకరించాడు. అతను ఆ 40,000 హదీసులని 7,00,000 హదీసుల నుండి ఎంచుకున్నాడు. అంటే ఇంకోరకంగా చెప్పాలంటే, అతను 6,60,000 హదీసులు అబద్ధాలని నిరూపించబడినవి

www.thraithashakam.org

లేక కల్పితాలు మరియు అవి ధ్రువీకరించినవి కాకపోవచ్చు. అంటే దాదాపు 94% అబద్ధాలు మరియు కల్పితాలు.

3) బుఖారి దాదాపు 6,00,000 హదీసులు సేకరించాడు కానీ 7275 హదీసులని మాత్రమే స్వీకరించాడు మరియు 5,92,725 హదీసులని నిరూపితం కానివి, అబద్ధాలు కట్టు కథలు అని నిర్ధారించుకున్నారు. అంటే అవి దాదాపు 99% తను సేకరించిన వాటిలో గలవు.

4) మోస్లేమ్ 3,00,000 హదీసులని సేకరించాడు కానీ 4,000 మాత్రమే స్వీకరించాడు. 2,96,000 హదీసులని నిరాకరించాడు. అంటే దాదాపు 99% తను సేకరించిన హదీసులు. (దీనినిబట్టి హదీసులలో ఎన్ని అసత్యాలు గలవో అర్థమవుతుంది.)

ఈ విషయాలు మనకు ఒక అవగాహన ఇస్తాయి. ఏమిటంటే వెనుక ద్వారం గుండా ఇస్లామ్ మతంలోనికి ఎంత కలుషితం చేరిందో మరియు చేరటానికి ప్రయత్నం చేసిందో. ఇప్పుడు మనము అర్థము చేసుకోవాలి దేవుడు ఎందుకు ఒకే ఒక హదీసు అని నిర్ధారించబడిన తన గ్రంథమును కాపాడుతానని, సంరక్షిస్తానని ప్రతిజ్ఞ చేశాడో, ఆ గ్రంథమే స్వీకరించవలసిన హదీసు మరియు ఉత్తమమైన హదీసు. అదే ఖుర్‌ఆన్ గ్రంథము.

## దేవుడిని అవమానపరిచే హదీసులు :-

**క్రింద కొన్ని హదీసు ఉదాహరణలు ఇవ్వబడినాయి. ఏవి దేవుడిని అవమానపరుస్తున్నాయో చూడండి.**

దేవుడు తన గురించి ఖుర్‌ఆన్‌లో చెప్పిన మాటలు మనము గుర్తు తెచ్చు కొనుట మనకు ఉపయోగకరం.

www.thraithashakam.org

(6–113) ఎవరి చూపులూ ఆయనని అందుకోలేవు. ఆయన మాత్రం అందరి చూపులని అందుకోగలడు. ఆయన ఎంతో సునిశిత దృష్టికలవాడు, ప్రతీ దానిని తెలుసుకోగలవాడు.

(42–11) విశ్వ వ్యవస్థలో ఆయనను పోలినది ఏదీ లేదు.

మోసే దేవుడిని చూడాలని అడిగినప్పుడు (7–143) దేవుడు తనని మోసే చూడలేడు అని మోసేకి చెప్పాడు.

ఇప్పుడు మనము బుఖారి మరియు మోస్లేమ్ దేవుడిని గురించి వర్ణిస్తూ తమ గ్రంథాలలో చెప్పిన కట్టుకథలు అన్ని అవి ప్రవక్త యొక్క మాటలు అని చెప్పినవి (చెప్పారు)

1) దేవుడు తన విశ్వాసులకి కనిపిస్తాడు, వారు నిండు చంద్రుడిని చూసినట్టు చూస్తారు **(బుఖారి భాగం 9, బుక్ 93, నెంబర్ 529). (దేవుడు కనిపించడు అని ఖుర్‌ఆన్ చెప్పింది.)**

2) దేవుడు తన పాదాన్ని నరకాగ్ని మీద ఉంచాడు. దానితో అది నిండుకుంటుంది అని **(బుఖారి భాగం 8, బుక్ 78, నెంబర్ 654).** (ఖుర్‌ఆన్ ప్రకారము పూర్తి అసత్యము)

3) దేవుడు మనుషులవలె నవ్వుతాడు! **(మోస్లేమ్ బుక్ 1, నెంబర్ 349). (దేవుడు మనుషులవలె లేడు)**

## అబూ హురైరా మరియు ఎన్నో అసత్యాలు :–

అబూ హురైరా యెమెన్ దేశం నుంచి హిజ్రా ఏడవ శతాబ్దంలో వచ్చాడు మరియు ఇస్లామ్ మతంలోనికి మారాడు. దాదాపు రెండు సంవత్సరాలు ప్రవక్త ముహమ్మద్ సాన్నిధ్యంలో వున్నాడు. అతను 5000 కంటే ఎక్కువ హదీసులు చెప్పాడు. 5374 ఖచ్చితంగా అంటే అన్ని

www.thraithashakam.org

కేవలము రెండు సంవత్సరాలకంటే తక్కువ ప్రవక్తతో కలిసివున్న కాలంలో (ఆయిషా, అబూ బేకర్ మరియు ఒమర్ చెప్పిన తక్కువ హదీసులతో పోల్చినప్పుడు) అతను చెప్పిన హదీసులు చాలా వరకు "ఆహద్" హదీసులు అని పిలువబడేవి అనగా! కేవలం ఒకే వ్యక్తి సాక్షిగా ఉన్న హదీసులు, ఆ ఒక వ్యక్తి అబూ హురైరా మాత్రమే. ప్రవక్త యొక్క కొంతమంది సన్నిహితులు మరియు ప్రవక్త భార్య ఆయిషా అతనిని (అబూ హురైరా) అబద్ధాలకోరు అని ఆరోపించారు. అతను హదీసులకి గొప్పతనం చేకూర్చటానికి ఒక హోదా పొందటానికి ప్రవక్త గురించి అబద్ధాలు చెప్పేవాడు అని. నడిపించ బడిన రెండవ ఖలీఫా ఒమర్ ఇబ్న్ అల్–ఖత్తాబ్, అబూ హురైరా ప్రవక్త గురించి అబద్ధాలు చెప్పడం ఆపకపోతే దేశం నుండి పంపిస్తాను అని అబూ హురైరాని ఒమర్ ఇబ్న్ అల్–ఖత్తాబ్ బెదిరించాడు, ఒమర్ చంపబడే అంతవరకు అతను ఊరికే ఉండి మళ్లీ మొదలు పెట్టాడు. అతను ముస్లీమ్‌ల ఖలీఫాను ఆనందింప చేయటము కోసం హదీసులని చెప్పటము అలాగే కొన సాగించాడు. అతను సిరియాలో ముఆవియా యొక్క రాజ భవనంలో జీవించిన కాలంలో కూడా హదీసులు చెప్పాడు. అబూ హురైరా తన ప్రేక్షకులకి హదీసులు చెప్పుచూ ఇలా చెప్పాడు తాను ఎప్పుడైనా ఒమర్ జీవించి ఉన్నప్పుడు హదీసులు చెప్పియుంటే తనకి ఒమర్ కొరడా దెబ్బలు ఇచ్చేవాడు అని.

అబూ జాఫర్ అల్ ఇస్కఫి ఇలా చెప్పాడు. ఏమిటంటే ఖలీఫా మరియు ముఆవియాహ్ కొంతమంది ప్రజలను ఎన్నుకొన్నారు అబూ హురైరాని కూడా కట్టు కథలు చెప్పటానికి, మరియు అలీ ఇబ్న్ అబూ తాలిబ్ గురించి హదీసులు చెప్పటానికి అతనిని తక్కువ చెయ్యటానికి, అలీ ఇబ్న్ అబూ తాలిబ్ ప్రవక్త యొక్క బంధువు (కజిన్) ముఆవియా యొక్క రాజ భవనంలో అబూ హురైరా జీవించాడు మరియు ముఆవియాకి

రాజకీయంగా కూడా సేవలు అందించాడు. అతను అలీ ఇబ్న్ అబూ తాలిబ్‌ను కించపరిచే, అవమానపరిచే కొన్ని హదీసులని తయారు చేశాడు. ఇంకా అబూ బాకర్, ఒమర్ మరియు ఉత్మన్‌కంటే తక్కువవాడు అలీ ఇబ్న్ అబూ తాలిబ్ అని చూపించటానికి, ఇది కేవలం ముఆవియాని సంతోష పెట్టుట కోసం అలా చేశాడు. ముఆవియాహ్ పరిపాలన కాలంలో, ఇమాం లేక ఖలీఫా మాటలను దేవుని మాటలవలె పాటించటానికి ఎన్నో హదీసులు అబూ హురైరా చేత తయారు చేయబడినాయి. అవి ఖుర్ఆన్ నియమానికి (రూల్‌కి) విరుద్ధముగా ఉన్నాయి. ఖుర్ఆన్ నియమం – అన్ని విషయాలు ప్రజాస్వామ్యబద్ధముగా ఉండాలి అనేవాడు. (అబూ హురైరా ఆ సమయములో ఖలీఫా యొక్క రాజభవనంలో నివసిస్తున్నాడని మర్చి పోకూడదు.)

అబూ హురైరా చెప్పిన ఎన్నో హదీసులు ఇతర హదీసులతో విభేదిస్తాయి. తాను చెప్పిన హదీసులతో కూడా, మరియు ఇతర ప్రజల హదీసులతో, ఖుర్ఆన్‌తో సాధారణ విచక్షణతో అతని హదీసులు విభేదిస్తాయి.

అబూ హురైరా కాబ్ అల్ అహబర్ యొక్క హదీసులు కూడా చెప్పాడు, కాబ్ అల్ అహబర్ ముస్లీమ్‌గా మారిన ఒక యూదుడు. అతను యూదుల కలుషిత గ్రంథాలని ఉపయోగించి ఖుర్ఆన్‌ని వివరించటానికి ప్రయత్నం చేశాడు. అతను కొన్ని దారుణమైన హదీసులని తయారు చేశాడు. అవి పూర్తిగా ఖుర్ఆన్‌కి విరుద్ధముగా ఉన్నాయి. అవి తోరాలోని తప్పుడు కథల నుండి తీసుకున్నవి.

ఇస్లామ్ చరిత్రకారులు అబూ హురైరాకు పరిపాలనాధికారం (Governor Ship) ఇవ్వబడిన తరువాతి కథ చెప్పారు. అతను రెండు

www.thraithashakam.org

సంవత్సరాలలో చాలా ధనవంతుడు అయ్యాడు. దానితో ఒమర్ అతనిని పిలిచి ఇలా చెప్పాడు. "నీవు, అల్లాహ్ యొక్క శత్రువు, నీవు అల్లాహ్ యొక్క ధనాన్ని దొంగలించావు. నేను నిన్ను బహరేన్ (దేశం) యొక్క ఎమిర్ (అధికారి / పాలకుడు) ని చేశాను. నీకు ఒక జత షూ (చెప్పులు) కూడా లేనప్పుడు, నీవు ఈ డబ్బునంతటిని ఎక్కడి నుండి పొందావు (4,00,000 దిర్హామ్)?" ఒమర్ 10,000 దిర్హాములు అతని నుండి తీసుకున్నది అని చెప్పబడివుంది (అబూ హురైరా కేవలం 20,000 దిర్హాములకు మాత్రమే హదీసులు వ్రాయడానికి ఒప్పుకున్నాడు)

హదీసులు కల్పితము చేయటంలో ఎక్కువగా అబూ హురైరా ఆరోపించబడ్డాడు. ప్రవక్త చిన్న భార్య ఆయిషా అతనిని నిందించింది. అతను సరికాని లేక అసంపూర్ణ కథలు చెప్పుటను మరియు ప్రవక్త ఎప్పుడూ చెప్పని హదీసులను తయారు చేసినందుకు అయిషా అతనిని నిందించడము జరిగినది. స్త్రీల మీద మరియు కుక్కల మీద అతనికి వేరు దురభిప్రాయం ఉందని అతనికి పేరు ఉండేది. అతను ముస్లీమ్ మహిళలను తీవ్రంగా అవమానించే కొన్ని హదీసులని తయారు చేశాడు. ఇంకా కొన్ని హదీసులు కుక్కలని చంపమని పిలుపునిచ్చే వాటిని కూడా తయారు చేశాడు. స్త్రీలను పంట చేలతో పోల్చడము ఎటువైపు నుండి అయినా భార్యను పొందవచ్చుననడము స్త్రీలను కించపరచినట్లు కాదా? (హదీసు మకరందము రెండవ భాగము 175వ పేజీ చూడండి.)

## ఆయిషా మరియు అబూ హురైరా బేధముగా :-

ఇబ్న్ కూతైబా అల్-దినోరి చేత రచించబడిన ప్రఖ్యాత గ్రంథం "టా ఔయిల్ ముఖ్తలాఫ్ అల్ హడిత్" లో, ఆయిషా అబూ హురైరాతో చెప్పుచున్న కథ. "ప్రవక్త చెప్పగా మేము విననివి నీవు ప్రవక్త హదీసులని

చెప్తున్నావు.” అతను ఇలా చెప్పాడు (బుఖారి నివేదించిన ప్రకారముగా) “నీవు (ఆయిషా) ఎప్పుడు అద్దంతో నీ అలంకరణతో బిజీగా ఉంటావు.” ఆమె (ఆయిషా) అతనికి ఇలా సమాధానం ఇచ్చింది “నీవు మాత్రమే నీ కడుపుతోను, నీ ఆకలితోను బిజీగా ఉన్నావు. నీ ఆకలే నిన్ను బిజీగా ఉంచింది, నీవు గుంపుగా వెళ్ళి ప్రజల వెంటపడుతున్నావు, వారిని ఆహారం అడుక్కుంటున్నావు. మరియు వారు నిన్ను తప్పించుకొని నీ నుంచి దూరంగా పోతున్నారు మరియు చివరికి నువ్వు వెనక్కు వచ్చి నా గది ముందరి నుంచి పోతావు, ప్రజలు నువ్వు పిచ్చోడివి అని అనుకొని అందరూ నిన్ను తొక్కుతారు.”

## బుఖారి యొక్క షాహీ : కలుషితానికి ఉదాహరణ

చాలామంది ముస్లీమ్‌లు హదీసుల గురించి గౌరవముతో మాట్లాడుతారు, ఆ మాటలు కొన్నిసార్లు ఖుర్ఆన్‌తో సమానంగా మరియు కొన్నిసార్లు ఖుర్ఆన్‌ని కూడా మించి ఉంటాయి. ఖుర్ఆన్ మనుషులకి దైవ గ్రంథము. (దేవుడు) విశ్వాసులు దేనిని మార్గదర్శి మరియు సంపూర్ణ ఆనందం కోసం దేనిని చూడాలో దాని గురించి సందేహానికి చోటు ఇవ్వరు. దేవుని మాటలు నమ్మనివారు సాధారణముగా హదీసుల ఆశ్రయం పొందుతారు. వాటిని ఖుర్ఆన్‌లో మాటి మాటికీ ఖండించారు. దేవుడు ఖురాన్‌ని “ఉత్తమ హదీసు” అని వర్ణించాడు, (39–23) “అల్లాహ్ అత్యుత్తమమైన విషయాన్ని అవతరింపజేశాడు. అది పరస్పరం పోలిక కలిగివుండే, పదే పదే పునరావృత్తం అవుతూ ఉండే ఆయతులతో కూడిన గ్రంథం రూపంలో ఉంది. దానివల్ల తమ ప్రభువుకు భయపడేవారి శరీరాలపై రోమాలు నిక్కబొడుచుకుంటాయి. ఆ తరువాత వారి శరీరాలు, హృదయాలు అల్లాహ్ స్మరణపట్ల మెత్తబడిపోతాయి. ఇది అల్లాహ్

www.thraithashakam.org

మార్గదర్శకత్వం. దాని ద్వారా ఆయన తాను కోరినవారిని సన్మార్గానికి తెస్తాడు. మరి అల్లాహ్ ఎవరిని మార్గం నుండి తప్పిస్తాడో అతనికి మార్గం చూపేవాడెవడూ ఉండడు." మరియు మనము ఖుర్ఆన్ తప్ప ఏ ఇతర హదీసు నమ్మకూడదు (45–6) "ఇవి అల్లాహ్ వాక్యాలు. వీటిని మేము నీకు ఉన్నదున్నట్లుగా వినిపిస్తున్నాము. ఇక వారు అల్లాహ్ మరియు ఆయన సూచనల (ను కాదన్న) తరువాత ఇక ఏ విషయాన్ని విశ్వసిస్తారు (ట)?" మరియు (7–185) "ఏమిటి, ఆకాశాల మరియు భూమి యొక్క వ్యవస్థను, అల్లాహ్ సృష్టించిన ఇతర వస్తువులను వారు గమనించలేదా? వారి కాలం దగ్గరపడి ఉండవచ్చునన్న సంగతిని గురించి కూడా వారు ఆలోచించలేదా? మరి ఖుర్ఆన్ తరువాత, వారు విశ్వసించే ఇంకొక వస్తువు ఏముంటుంది?"

బుఖారి ఎంతోమంది పండితులలో కేవలం ఒక పండితుడు మాత్రమే, ప్రవక్త మరియు అతని తరువాత ఖలీఫాలు అందరూ హదీసులు వద్దని ఆదేశాలు ఇచ్చినా కూడా బుఖారి హదీసులని సేకరించాలని నిర్ణయించుకున్నాడు. నేటి క్రిస్టియానిటీ ఎక్కువగా పాల్ యొక్క కలుషితం వలన కట్టుకథల వలన వచ్చినది అయినా, నేడు ఆచరింపబడుచున్న సాంప్రదాయ సున్ని ఇస్లామ్ బుఖారివంటి ప్రజలు నిజమైన ఇస్లామ్ మతమును కలుషితం చేయటం వలన తయారై వచ్చిన మతం.

ముస్లీమ్ ప్రజలు హదీసుల గ్రంథాల కోసం ఖుర్ఆన్ గ్రంథాన్ని విడిచిపెట్టిన వెంటనే, వారి మతము నమ్మలేనంతగా కలుషితం అయ్యింది (చెడిపోయింది). నేటి ఆచరణలో ఉన్న ఇస్లామ్ కేవలము బుఖారి, మోస్లేమ్, నిసే టెర్మితే, అబూ–దావుద్ మరియు ఇతరుల ప్రతిబింబం మాత్రమే. అది ఇంక ఎంతమటుకు ప్రవక్త ముహమ్మద్ ఇచ్చిన నిజమైన సందేశం కాదు.

బుఖారి హదీసుల నిర్ధారణను చూస్తాను అన్న నియమాన్ని ఉల్లఘించడము మాత్రమే కాకుండా, ఇంకా అతని వ్యక్తిగత అభిప్రాయాలూ, రాజకీయ కూటమి మరియు అలీ ఇబ్న్ అబూ తాలిబ్‌వంటి వ్యక్తుల మీద ద్వేషము అతను తన గ్రంథములలో వ్రాయటం కొరకు ఎంచుకున్న హదీసుల మీద ప్రభావం చూపాయి, మరియు ఏ హదీసులని నిరాకరించాలో కూడా దాని మీద ప్రభావం చూపాయి. అతను హదీసులలో ఏమున్నదో అని ఎక్కువగా పట్టించుకోలేదు. అతను ఖుర్ఆన్‌కు వ్యతిరేఖంగా ఉన్న ఎన్నో హదీసులను వ్రాశాడు, ఇతర హదీసులతో మరియు సాధారణ విచక్షణకు విరోధముగా వున్నవి, దేవుడిని అవమానపరిచేవి, ప్రవక్త ముహమ్మద్‌ని అవమానపరిచేవి, ప్రవక్త భార్యలను మరియు అతని కుటుంబాన్ని అవమానపరిచేవి. ముఆవియాహ్ పట్ల బుఖారి విధానము మరియు అలీ ఇబ్న్–అబూ తాలిబ్‌కి విరుద్ధముగా సంబంధించి అతని (బుఖారి) విధానము కేవలము బుఖారి యొక్క అక్రమ రాజకీయము వలన మరియు అలీని తక్కువ చేసి అతని బద్ధ శత్రువు ముఆవియాహ్ పూర్తి అక్రమాల వ్యక్తి మరియు చిన్న చిన్న ఇస్లామ్ ధర్మాలను పాటించని వాడు అయినా కూడా అతనిని (ముఆవియాహ్) స్వచ్ఛమైన సక్రమమైన వ్యక్తిగా వర్ణించే హదీసులను గ్రంథములో వ్రాయటంలో అతని (బుఖారి) పక్షపాత వైఖరి. బుఖారి తన గ్రంథములో ఎన్నో హదీసులని చెప్పాడు. అవి నేడు 'సాహీహ్ (ధృవీకరించ బడినవి) అని అబద్దాలకోరులు అక్రమార్కులు వ్రాసినవి నమ్మదగనివి అనబడిన వాటిగా ప్రజల చేత పేరు పొందాయి. అతని తరువాత వచ్చిన ముస్లీమ్ పండితులు బుఖారి యొక్క లోపాలని మరియు ఇతర హదీసు పండితులని ఇంకా అతనిలాంటి సున్నాహ్ (సంప్రదాయం / విధానం) ని బయట పెట్టటానికి భయపడ్డారు. దీనికోసం ఒక ఉదాహరణ. "అల్–ముస్త్రదేక్" అను ప్రఖ్యాత గ్రంథములో రచయిత ఇలా చెప్పాడు. బుఖారి తన గ్రంథములో మోస్లేమ్ నిరాకరించిన 434 వ్యక్తుల నుండి

సేకరించిన హదీసులని తన (బుఖారి) గ్రంథములో వ్రాశాడు. వారిని మోస్లేమ్ తన గ్రంథము 'సాహీహ్ మోస్లేమ్' కొరకు ఆ 434 మందిని నమ్మదగిన వారు కాదు అని నిరాకరించాడు. ఇంకో ప్రక్క మోస్లేమ్ తన గ్రంథములో బుఖారి నిరాకరించిన హదీసులు చెప్పిన 625 మందిని తన గ్రంథములో స్వీకరించాడు.

హదీసుల ద్వారా ఇస్లామ్ యొక్క కలుషితం, ప్రవక్త జీవించి యున్న కాలములో మరియు అతను మరణించిన తర్వాత మొదలైంది. ఈ హదీసు సేకరణలు దేవుని చేత ఖండించబడినాయి. ఇంకా ప్రవక్త మరియు సహాబా (ప్రవక్త యొక్క సన్నిహితులు) చేత కూడా ఖండించబడ్డాయి. హిజ్రా రెండవ శతాబ్దం చివరికి వచ్చేసరికి ప్రఖ్యాత ఆరు గ్రంథాలూ రచించే సమయానికి ఈ పని అత్యంత తీవ్రస్థితికి చేరుకుంది. ఖుర్ఆన్ చెప్తుతుంది తీర్పు దినమున ప్రవక్త దేవునికి ముస్లీమ్స్ ఖుర్ఆన్ గ్రంథము విడిచిపెట్టుట గురించి ఫిర్యాదు చేస్తాడు అని.

## ఇతర సాహీహ్, అబద్ధాలు మరియు కల్పితాలు :-

ఈ భాగంలో కొన్ని దారుణమైన అబద్ధాలు మరియు కల్పితాలు చెప్పబడ్డాయి. వేటిని హదీసు పండితులు ధృవీకరించబడినవి (సాహీహ్) అని చెప్పారో, ఈ హదీసులు హదీసు సేకరణలలో నిర్ధారించబడినవి, వాటిని చెప్పినవారు (ఇస్నాద్) నమ్మదగిన వారు అని భావించే వరకు ఆ హదీసులు ధృవీకరించబడుతాయి. ఇది హదీసులలో ఏమి విషయం ఉన్నది అన్నదానికి సంబంధం లేకుండ. అవి ఖుర్ఆన్‌కి విరోధముగా ఉన్న లేక అందులో సాధారణ విచక్షణ లేకపోయినా అది పెద్ద విషయం కాదు. క్రింద చెప్పబడినవి ఈ సాహీహ్ అబద్ధాలు యొక్క ఉదాహరణలు (శాంపిల్) మాత్రమే :

**1) నిలబడి త్రాగవద్దు.**

సాహీహ్ మోస్లేమ్, బుక్ 23, నెంబర్ 5017

"అబూ హురైరా ఇలా చెప్పాడు. దేవుని దూత చెప్పాడు 'నిలబడి యున్నప్పుడు త్రాగవద్దు, ఎవరైనా మర్చిపోయి అలా చేసుంటే, వారు త్రాగినది అంతా వాంతికి చేసుకోవాలి"

**2) నిలబడివున్న స్థితిలో ఉచ్చ పోయండి.**

సాహీహ్ బుఖారి Vol.3, Book 43, Number 651.

"దేవుని యొక్క వార్తకుడు నిలబడి ఉన్నప్పుడు ఉచ్చపోశాడు."

**3) నిలబడి ఉన్నప్పుడు ఉచ్చపోయకండి.**

సునన్ ఇబ్న్ మజాహ్, Vol.1, Book 1, Number 308

"నిలబడి ఉచ్చ పోయకండి"

**4) దేవుని రూపంలో మనిషి.**

సహీహ్ మోస్లేమ్, •Book 40, Number 6809.

అబూ హురైరా చెప్పాడు. దేవుని యొక్క దూత చెప్పాడు "గొప్పవాడైన అల్లాహ్ ఆదమ్‌ను తన సొంత రూపంలో సృష్టించాడు. అబూ హురైరా చెప్పిన ఇంకొక అబద్దము మరియు కల్పితము మరియు మోస్లేమ్ తన గ్రంథములో స్వీకరించినది.

**5) ఆదమ్ 60 బాహువుల ఎత్తు మరియు 7 బహువుల వెడల్పు**

ముస్నాద్ అహ్మద్ :

అబూ హురైరా ఇలా చెప్పాడు, ప్రవక్త చెప్పాడు "దేవుడు ఆదమ్‌ను 60 బాహువుల ఎత్తు మరియు 7 బహువుల వెడల్పుతో తయారు చేశాడు"

www.thraithashakam.org

మరియు సాహీహ్ మోస్లేమ్‌లో Book 40, Number 6795 ఆదమ్ 60 గజాల ఎత్తు! అని చెప్పబడింది.

**6) స్త్రీలు, కుక్కలు మరియు గాడిద**

సాహీహ్ మోస్లేమ్, Book 4, Number 1032.

"దూత చెప్పాడు ఒక గాడిదకానీ, స్త్రీకానీ, నల్లకుక్కకానీ ప్రార్థన చేసేవాడి ముందు నుంచి వెళ్ళింది అంటే ఆ ప్రార్థన పనికి రాదు."

ఇది స్త్రీలకు ఎంతటి ఘోర అవమానం? నిజంగా ఈ మాటలు దేవుని ప్రవక్త నుండి వచ్చియుంటాయా?

**7) స్త్రీలలో చెడు శకునం :**

సాహీహ్ బుఖారి Vol.7, Book 62, Number 30.

"స్త్రీలలో, గుర్రంలో, ఇంటిలో చెడు శకునం (ఒమెన్) ఉంది".

స్త్రీలకు వ్యతిరేఖంగా మరొక పక్షపాత విషయం హదీసులని వ్రాసిన వారి యొక్క పద్ధతి. ఖుర్‌ఆన్ నుండి వచ్చిన నిజమైన ఇస్లామ్ స్త్రీలకు సంపూర్ణ గౌరవాన్ని ఇస్తుంది మరియు అలాంటి వర్ణనలని ఎప్పుడూ ఉపయోగించదు.

**8) బేధము మరియు బేధము లేకుండుట దూతలలో, విరుద్ధము :**

సాహీహ్ బుఖారి Vol.4, Book 55, Number 608.

ఇబ్న్ అబ్బాస్ ఇలా చెప్పాడు, ప్రవక్త చెప్పాడు "ఎవరు కానీ నేను యూనుస్ (జోనా) ఇబ్న్ మత్తకంటే మేలు అని అనకూడదు".

పై హదీసు చెప్పబడియున్నా కూడా, మనము హదీసు గ్రంథములలో ముహమ్మద్ ప్రవక్త, ఇతర ప్రవక్తలకంటే ఇతర మనుషులకంటే గొప్పవాడు అని చెప్పిన ఎన్నో కథలను చూడవచ్చు. ఈ హదీసులు పైన చెప్పిన

www.thraithashakam.org

హదీసుకి విరుద్ధము మరియు ఖుర్‌ఆన్ బోధలకు విరుద్ధము. విశ్వాసులకు అందరు కోసం ఖుర్‌ఆన్ స్పష్టమైన ఆదేశం కలిగివుంది. ఏమిటంటే ప్రవక్తలలో తేడాలు కల్పించుకోకండి (2–285) “తన ప్రభువు తరపున అవతరింపజేయబడిన దానిని ప్రవక్త విశ్వసించాడు. దాన్ని విశ్వాసులు కూడా (సత్యమని నమ్మారు) వారంతా అల్లాహ్ను, ఆయన దూతలను, ఆయన గ్రంథాలను ఆయన ప్రవక్తలనూ విశ్వసించారు. మేము ఆయన (పంపిన) ప్రవక్తల మధ్య ఎలాంటి విచక్షణము, భేదభావాన్నీ పాటించము” (అని వారు చెబుతారు.) “మేము విన్నాము. విధేయులం అయ్యాము. మా ప్రభూ! మేము నీ క్షమాభిక్షను అర్థిస్తున్నాము. కడకు మేము మరలి రావలసింది నీ వద్దకే” అని అంటారు. హదీసు గ్రంథాలను అనుసరిస్తున్నాము అని చెప్పేవారు ప్రవక్తలలో తేడాలు కల్పించుకోకండి అని మళ్లీ మళ్లీ చెప్పిన హదీసులను గురించి పట్టించుకోలేదు.

(అన్ని కులముల వారు నేను చెప్పిన మూడు మతముల సారాంశమును చదివి మనస్సు మార్పు చెందిన వారుగా తయారైనారు. ఆ విషయమునకు ఉదాహరణగా ఒక ముస్లీమ్, ఒక క్రైస్తవుడు వ్రాసిన ఉత్తరములను చదవండి.)

## ఉత్తరములు

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్ల వారి**

పాద పద్మములకు నా సాష్టాంగ వందనములు.

నా పేరు సాకా ధనుంజయ, S/O అచ్చప్ప, వయస్సు 48 సం॥లు, కులము పద్మశాలి, నివాసము బెంగుళూరు, యలహంక అగ్రహార లేఅవుట్.

నేను ప్రస్తుతము బెంగుళూరు సెంట్రల్ జైల్‌నందు గత నాలుగు సంవత్సరముల నుండి జైల్‌నందు సజా ఖైదిగా ఉన్నాను. నాకు జీవిత ఖైదీగా కోర్టు శిక్ష విధించింది. నా సజా ఖైది నెంబర్. 9203 (Convict Prison) రూమ్ నెంబర్ C-7 (Block No-7) నందు ఉంటున్నాను.

నేను బాల్యము నుండి రాముడు మరియు ఆంజనేయ భక్తునిగా ఉంటూ, నా జీవితములో వచ్చే సమస్యలకు, బాధలకు అనుగుణముగా వేరే ఇతరత్రా దేవతలను కూడా పూజించేవాడిని. కానీ ఎంతమంది దేవతలను పూజించినా నా సమస్యలు, బాధలు పోలేదు. నేను బాల్యము నుండి దైవభక్తితో జ్ఞానము తెలుసుకోవాలని చాలా శ్రద్ధతో కొన్ని ఆశ్రమాలకు కూడా వెళ్ళి, జ్ఞానబోధలు వినుచుండేవాడిని. అందులో భాగముగా కైవారం తాతయ్య మఠములో (పోతులూరి వీరబ్రహ్మయ్య గారి అనుబంధ మఠం) వెళ్ళి తత్త్వ జ్ఞానబోధలను శ్రద్ధగా వింటుండేవాడిని. కానీ నా బాధలు ఇంకా పెరుగుతూనే ఉండేవి.

నేను జ్ఞానము అని, భక్తి అని తిరుగుతూ ఉంటే మా కుటుంబము వారంతా వ్యతిరేఖించుతూ ఉండేవారు. అయినా నేను అలాగే చేస్తూ ఉండడము వలన, నా కుటుంబమువారు, బంధువులు అందరూ దూరమయ్యారు. నేను పెళ్ళి కూడా చేసుకోలేదు. నాకు జీవితముపై నిరాశ కలుగుతుండేది, బాధలు భరిస్తూ, జ్ఞానము తెలుసుకోవాలనే శ్రద్ధతో చాలాచోట్లకు వెళ్ళి, గురువుల వద్దకు, పండితుల వద్దకు, బాబాల వద్దకు కూడా వెళ్ళి చాలా బోధలు వింటుండే వాడిని. నాకు జ్ఞాన సంబంధ ఎన్నో ప్రశ్నలు వస్తుండేవి, వారిని అడిగితే వారు చెప్పే సమాధానములో నాకు తృప్తిగా సమాధానము దొరికేది కాదు.

ఈ విధంగా నేను జీవితము గడుపుచుండగా, నేను పని చేసే చింతామణి టౌన్‌లో ఉన్న కొనకపల్లి గ్రామంలో హ్యాండ్లూమ్ మగ్గం పరిశ్రమలో మా పరిశ్రమ యజమానికి, అతని భార్యకు మధ్య గొడవ వచ్చి ఆమె నిప్పంటించుకొని ఆత్మహత్య చేసుకొనగా, ఆ నేరం నాపై మోపబడి నాకు జీవిత ఖైదీగా శిక్ష పడింది. జైలు జీవితము గడుపుతూ చదువు పెద్దగా రాని కారణముగా ఇంకా చదువుకోవాలనే కోరిక కల్గి కన్నడ, తెలుగు భాషలు నేర్చుకొని వార్తా పత్రికలు, ఇతర దైవ గ్రంథాలు చదువుతూ, చదువును కొనసాగిస్తూ, కేసు ట్రైల్ నడుపుకుంటూ, భగవద్గీతను చదువుకుంటున్నాను.

జైలుకు వచ్చిన ఒక సం॥ కాలమునకు ఒకరోజు మా జైల్‌లో మా రూమ్‌కు క్రైస్తవ బోధకులు వచ్చి బైబిల్ గురించి, ఏసు గురించి బోధించారు. నేను బోధ తర్వాత ఫాదర్‌ని కలవాలని అనిపించింది. ఎందుకంటే వారి బోధలో మీ పాపాలు పోతాయి, బాధలు, కష్టాలు పోయి కేసులో నుండి కూడా పోతారు అని చెప్పినారు. అది విన్న నేను ఫాదర్‌గారికి నా బాధలు చెప్పుకున్నాను. అప్పుడు ఫాదర్‌గారు ఏసుప్రభువును నమ్ముకొని, బైబిల్ చదువుకుంటూ, రోజు ప్రార్థన చేసుకుంటూ ఉండమని ఒక బైబిల్ ఇచ్చి దీవించారు. అప్పటి నుండి ఏసుభక్తునిగా మారిపోయి, హిందూ గ్రంథాలను, దేవతలను వదిలివేసినాను. నేను పూర్తి విశ్వాసిగా మారి, ఏసుభక్తునిగా ఉంటూ, బైబిల్ చదువుతూ, ప్రార్థనలు చేస్తూ, చర్చికి వెళ్ళి క్రైస్తవ బోధలు వింటూ, ఇతరులకు కూడా బోధలు చెప్పుతూ నా జీవితం గడుపుతున్నాను. అయిన నా బాధలు, సమస్యలు అలాగే ఉన్నాయి. కేసు కూడా పరిష్కారము కావటం లేదు. ఈ విషయము గురించి ఫాదర్‌ను అడుగగా, ఎన్నో సం॥ల నుండి ఉన్న వారికే సమస్యలు పోలేదు. నీకు అప్పుడే పోతాయా? ఇంకా

కొన్నాళ్ళు విశ్వాసముతో ప్రార్థన చేస్తూ వుండమని చెప్పగా నేను అలాగే చేస్తూ ఉండేవాడిని. నా కేసు ట్రైల్ అయిపోయి నేను క్రైస్తవునిగా మారిన ఒకటిన్నర సం॥నకు కేసు జడ్జిమెంట్ జరిగి, నాకు జీవిత ఖైదు శిక్ష పడింది. ఈ విషయము గురించి ఫాదర్‌ని అడుగగా వారు ఫలానా వారు ఏసుని విశ్వసించినందువలన తరువాత బెయిల్ దొరికింది అని, ఒక అతను కేసు కొట్టివేయబడిందని వారిని గురించి చెప్పారు. నేను అలాగే బైబిల్ చదువుకుంటూ, ప్రార్థనలు చేసుకుంటూ, జ్ఞాన బోధలు వింటూ కొన్ని అర్థము కాని వాక్యములను అడిగితే ఎందుకో వారి సమాధానం తృప్తిగా అనిపించక పోయేది. ఈ విధముగా నా జీవితము సాగుతుండగా!

ఒక రోజు సుమారు 7 లేదా 8 నెలల క్రితం మా రూమ్ ప్రక్కన ఉన్న రూమ్‌లో ఉన్న దిలీప్ అనే వ్యక్తితో ఒక వ్యక్తి దైవజ్ఞానము గురించి తెలుగులో బోధిస్తుండగా, నేను విని ప్రక్కనే పోయి నిలబడి వింటూ, ఈయన ఎవరు గడ్డము పెట్టుకొని ముస్లీమ్‌గా అనిపిస్తూ తెలుగులో దైవజ్ఞానము చెప్పుతున్నాడని కొంత శ్రద్ధ పెట్టి విన్నాను. ఆయన మాటలలో నమ్మకము సత్యము చెప్పినట్లుగా అనిపించి, కూర్చోని బోధ అయిపోయో వరకు శ్రద్ధగా విన్నాను. ఆయన చెప్పిన బోధ ఇంతవరకు ఎక్కడా వినలేదనిపించింది. బోధ అయిపోయిన తరువాత ఆయనతో పరిచయము చేసుకోగా, ఆయన పేరు అమీర్ అలి అని చెప్పారు. ఆ తరువాత ఆయన నాతో మీకు దేవుని మీద భక్తి, జ్ఞానం మీద శ్రద్ధ ఉంటే, దీలీప్ దగ్గర జ్ఞానగ్రంథములు ఉన్నాయి. అందులో మీకు నచ్చింది ఒకటి తీసుకొని చదవమని చెప్పారు. అయినా నాకు గ్రంథము చదవడము ఇష్టముగా అనిపించలేదు. ఎందుకంటే బైబిల్ చదువుతూ ఉండేవాడిని, వేరే గ్రంథాలు చదవవద్దని మా ఫాదర్ కూడా చెప్పినారు. కానీ అమీర్ అలి చెప్పిన బోధ నాకు అదే రోజు పదే

www.thraithashakam.org

పదే గుర్తుకు వస్తావుంది. ఆయన చెప్పిన బోధ సత్యము అనిపించింది. నా మనసులో అదే రోజు సాయంత్రం ఆయన చెప్పిన గ్రంథము చదవాలనిపించి, దీలీప్ దగ్గరకు వెళ్ళి ఆ గ్రంథాలు చూసి అందులో **"దేవాలయ రహస్యాలు"** అనే గ్రంథమును తీసుకొని వచ్చి చదివినాను. దేవాలయములో ఉన్న రహస్యాలు గ్రంథము ద్వారా తెలిసి అద్భుతం అనిపించింది. అప్పుడు దేహమే దేవాలయమని, దేవుడు దేహములోనే ఉన్నాడని తెలిసి నా హృదయములో ఎంతో ఆనందము, తృప్తి కల్గినాయి. నా మనసులో మిగతా గ్రంథాలు కూడా చదవాలనే ప్రేరణ పెరిగింది. తరువాత అమీర్ అలితో రెండవసారి కలిసినపుడు జ్ఞానపరముగా చర్చించిన తరువాత నాలో ఉన్న కొన్ని ప్రశ్నలకు ఆయన ద్వారా తెలిసిన సమాధానములో సత్యమున్నదనే నమ్మకము, విశ్వాసం కలిగినది. అప్పుడు ఆయన నాతో స్వామివారి గ్రంథాలు మిగతావి కూడా చదవండి, ప్రపంచములో ఇంతవరకు ఎవరికీ తెలియని జ్ఞానరహస్యాలు స్వామి వారి గ్రంథముల ద్వారా తెలుస్తాయి అని చెప్పి మళ్ళీ కలుద్దాము, అప్పటివరకు గ్రంథాలు చదువుతూ ఉండమని చెప్పి వెళ్ళిపోయాడు. ఇప్పటివరకు నేను చదివిన గ్రంథాలు 1. దేవాలయ రహస్యాలు 2. ప్రబోధ 3. సుబోధ 4. శిలువా దేవుడా? 5. ఏసు చనిపోయాడా చంపబడ్డాడా? 6. తల్లి తండ్రి 7. సమాధి 8. త్రైతాకార రహస్యం 9. శ్రీకృష్ణుడు దేవుడా భగవంతుడా? 10. దయ్యాల భూతాల యధార్థ సంఘటనలు 11. జనన మరణ సిద్ధాంతము 12. వార్తకుడు వర్తకుడు 13. ప్రతిమ × విగ్రహ 14. సత్యాన్వేషి కథ 15. యజ్ఞములు 16. మన పండుగలు 17. ఇందూ సాంప్రదాయాలు 18. భగవద్గీత 19. దేవుని గుర్తు 963, మాయ గుర్తు 666 20. ప్రసిద్ధి బోధ 21. నాస్తికులు. ఆస్తికులు 22. కర్మపత్రం

www.thraithashakam.org

23. దేవుని చిహ్నం 24. దేవుని ముద్ర 25. మతాతీత దేవుని మార్గం 26. నిగూఢ తత్త్వార్థ బోధిని 27. చెట్టుముందా, విత్తు ముందా? 28. ఒక్కడే ఇద్దరు 29. కృష్ణ మూస 30. ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు 31. హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా? 32. ఆధ్యాత్మిక ప్రశ్నలు జవాబులు. 33. భగవాన్ రావణ బ్రహ్మ.

ఈ గ్రంథాలు అన్నీ అమీర్ అలి ద్వారా తీసుకొని చదవినాను. ఇప్పుడు వేదాలు, ఉపనిషత్తుల గురించిన గ్రంథాలు ఇచ్చినారు. చదువుతున్నాను. ఇంకా గ్రంథాలు చదవాలనే కాంక్ష పెరుగుతూ ఉంది. ఈ గ్రంథాల ద్వారా తెలిసిన నిజమైన జ్ఞానము ఏమనగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని మూడు ఆత్మల జ్ఞానం ఇప్పటి వరకు ఎవరూ చెప్పలేదు అని తెలిసింది. దేవునికి, భగవంతునికి తేడా తెలిసినది. ఆత్మ పని తెలిసినది. పరమాత్మ అంశయే భగవంతునిగా కృష్ణునిగా వచ్చినాడు అని తెలిసింది. ధర్మములు, అధర్మములు తెలిసినాయి. నిరాకారము, సాకారము గురించి తెలిసింది. ముఖ్యముగా శరీరం 24 భాగాలు ప్రకృతి అని అందులో మూడు ఆత్మలు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు ఉన్నాయని నేను జీవాత్మ కర్మలు అనుభవించేవాడినని, ఆత్మ అనుభవింపజేసేదని, పరమాత్మ సాక్షి భూతుడని తెలిసింది బ్రహ్మయోగం, కర్మయోగం, భక్తియోగం కూడా తెలిసినది.

ద్వితీయ దైవగ్రంథము బైబిల్ ద్వారా రాబోయే ఆదరణకర్త సాక్షాత్తు యోగీశ్వర్లువారే, పరిశుద్ధాత్మ అని తెలిసినది. భగవద్గీత శ్లోకాల సారాంశము మొత్తము శరీరములో ఉన్న జ్ఞానం గురించే చెప్పిందని తెలిసినది. భగవద్గీతలో భాగమే బైబిల్ జ్ఞానము అని తెలిసినది. సాకార

www.thraithashakam.org

రూపంలో భగవంతుడు చెప్పినదే నిజమైన జ్ఞానము అని, అధర్మముల ఆచరణ ద్వారా కర్మలు అంటుకొని జన్మలు కల్గుతాయని, ధర్మముల ఆచరణ ద్వారా కర్మలు నాశనము చేసి, మోక్షము ప్రాప్తింపజేస్తాయని తెలిసింది. దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే, దేవుని మోక్షము ఒక్కటే అనే నిజము తెలిసినది. మతాలు మానవుల సృష్ఠి అని తెలిసినది. ప్రపంచములో ఏ మానవుడు ఇంత గొప్ప జ్ఞానము చెప్పలేదని, దైవశక్తి తప్ప మానవ శక్తి చెప్పిన జ్ఞానము కాదు అని, ఈ జ్ఞానము ద్వారా సాక్షాత్తు పరమాత్మ అంశ అయిన భగవంతుడే యోగీశ్వరుల వారు అని, "భగవాన్ రావణ బ్రహ్మ" మరియు "వేదములు మనిషికి అవసరమా?" అన్న గ్రంథములపై ఉన్న నాలుగు దైవాంశలు **1. భగవాన్ రావణ బ్రహ్మ 2. శ్రీకృష్ణుడు 3. ఏసు ప్రభువు 4. యోగీశ్వరులు** వీరు నలుగురు సాక్షాత్తు పరమాత్మ అంశ అయిన భగవంతులని తెలిసినది. ప్రపంచ మూఢులను జ్ఞానులజేయ వచ్చిన భగవంతులని పూర్తిగా విశ్వసిస్తున్నాను. త్రిమత ఏకైక గురువు, ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి అని, మీ గ్రంథాలపై ఉన్న విషయం 100% నిజము. తమరి దైవజ్ఞాన గ్రంథముల ద్వారా మా జీవితం ధన్యమయినది. మిగిలిన జీవితము కూడా జ్ఞానము తెలుసుకుంటూ, ఆచరిస్తూ ధర్మ ప్రచారం చేస్తూ గడపాలని నిశ్చయించుకొని సంపూర్ణ జ్ఞానాన్ని ఆచరించే శక్తిని అనుగ్రహించమని నా పూర్ణ మనసుతో, నా పూర్ణ హృదయంతో, నా పూర్ణ ఆత్మతో సాకార రూపము అయిన యోగీశ్వరుల వారి పాద పద్మముల పైన శిరస్సు నుంచి శరణు వేడుతున్నాను. భగవద్గీత శ్లోకాలు 3-9 మరియు 17-66 ప్రకారం సాకార రూపము అయిన మీరు మాకు పాపవిమోచన చేసి ముక్తిని చెయ్యమని ఈ జన్మలో మీ దర్శన భాగ్యము

www.thraithashakam.org

కల్గించి, ధన్యున్ని చేయ్యమని మరి ఒక్కసారి సాష్టాంగ వందనం మీ పాదపద్మములకు చేయుచూ....

మీ సంపూర్ణ విశ్వాసి

**ధనుంజయ్**

*****

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్ల వారి**

**పాద పద్మములకు నా సాష్టాంగ వందనములు.**

సాక్ష్యాత్తూ ఖుదాకు (సజ్దా కర్తాహు) సాష్టాంగ వందనములు సమర్పించుకుంటున్నాను.

నేను అనగా జీవాత్మగా ఉన్న నా శరీరము యొక్క పేరు సయ్యద్ సల్మాన్‌షా S/o సయ్యద్ ముస్లీమ్‌షా నా వయస్సు 34 సం॥లు. వృత్తి అక్వేరియం (షోకేసులలో చేపలు పెంచి అమ్మటం) మతము ముస్లీమ్, చదువు 9వ తరగతి ఇంగ్లీషు మీడియము, నివాసము బెంగుళూరు (వివేక్‌నగర్).

ప్రస్తుతము సెంట్రల్ జైల్ బెంగుళూరులో అండర్ ట్రైల్ ఖైదిగా (UTP) ఉన్నాను. నా ఖైది నెంబర్ : 7579 / 14 రూమ్ నెంబర్ 10లో జైలు జీవితము అనుభవిస్తూ ఉన్నాను. నా కుటుంబ వివరాలు ఏమనగా మా కుటుంబము వారు గత ఏడు తరాల నుండి ముస్లీమ్ పండితులుగా (అనగా హాఫిజె ఖుర్ఆన్, ఆలిమె ఖుర్ఆన్) ఉన్నారని తెలిపినారు. ప్రస్తుతం నేను తప్ప మా కుటుంబము వారు అందరూ ముస్లీమ్ పాండిత్యము కల్గినవారే. (తమ గ్రంథముల ద్వారా జ్ఞానము తెలిసిన తర్వాత ఎవరు పండితులో అనే విషయము తెలిసింది).

www.thraithashakam.org

నేను సాధారణ ముస్లీముగా ఉంటూ, నమాజ్ చేసుకుంటూ, రోజా ఉంటూ జీవితం గడుపుతూ ఉండేవాడిని. నాకు సాధారణముగా సహనము తక్కువ, కోపం ఎక్కువగా ఉండేది. ఎక్కువ అసహనముతో, ఆవేదనతో బాగా వత్తిడికి లోనౌతూ ఉండేవాడిని. జ్ఞానమునకు సంబంధించిన ఆలోచనలు వస్తూ వుండేవి. ఆ క్రమంలో నేను మా ఇంటి నుండి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాను. హిందూ పుణ్య స్థలాలైనా ద్వారకా (గుజరాత్) నగరమునకు వెళ్ళినాను. ఆ తర్వాత గోల్డెన్ టెంపుల్ (అమృత్‌సర్), హరిద్వార్, ఋషికేష్, డిల్లీలో ఉన్న ఆశ్రమాలు, మందిరములు, దర్గాలను సందర్శించుకుంటూ, హిందువుల జీవిత విధానాలు, ఆచరణలు, పూజా విధానాలు మరియు ముస్లీముల జీవిత విధానాలను పరిశీలించుకుంటూ, తెలుసుకుంటూ, 12 సం॥లు మా కుటుంబము వారితో సంబంధము లేకుండా గడిపి, తిరిగి 2008 సం॥లో ఇంటికి వచ్చాను. ఇంటిలో ఉంటూ రెండు సం॥లు ప్రైవేట్ వర్క్ చేసుకుంటూ ఉండగా, ఒక ముస్లీమ్ అమ్మాయితో ప్రేమలో పడి, మా కుటుంబమువారితో ఆమెతో పెళ్ళి గురించిన విషయము చర్చించితే వాళ్ళు తిరస్కరించారు. అమ్మాయి వాళ్ళ తల్లి తండ్రులు కూడా ఒప్పుకోలేదు. అప్పుడు నేను అమ్మాయిని హైద్రాబాద్ తీసుకెళ్ళి, అక్కడ పెళ్ళి చేసుకొని, బాగ్ అంబర్‌పేట్, హైద్రాబాద్‌లో నాలుగు నెలలు ఉండి తిరిగి బెంగుళూర్‌కి వచ్చినాను. నేను మా ఇంటికి వెళ్ళకుండా కిరాయి ఇంటిలో ఉండేవాడిని. అప్పటి వరకు నేను ముస్లీము గ్రంథాలు ఏవీ చదవలేదు. 2013 సం॥ వరకు నేను సాధారణ జీవితము గడుపు చుండగా కుటుంబ కలహాల కారణముగా, మా బాబాయిని హత్య చేయటం జరిగింది. అది నేను చేశానని ఎవరికీ తెలియదు. మరలా కుటుంబ తగాదాల కారణముగా 2014 లో 7 సం॥లు గల నా చెల్లెలు కూతురుని కూడా నా భార్య సహాయముతో హత్య చేయడము జరిగింది. అప్పుడు

పాత హత్య విషయము కూడా తెలిసిపోయింది. ఈ రెండు హత్యల కారణముగా నేను, నా భార్య 2014 సంIIము జులై నెల 14వ తారీఖున జైలుకు రావడము జరిగింది. అప్పటి నుండి అనగా 14.07.2014 నుండి ఇప్పటి వరకు అనగా నాలుగు సంIIల నుండి ఇద్దరము కూడా జైల్లోనే ఉన్నాము.

నేను జైలుకు వచ్చిన తరువాత జైల్లోఉన్న కొంతమంది ముస్లీమ్‌లతో పరిచయమై, 2014 జులై నుండి 2016 డిసెంబర్ వరకు హదీసులు చదువుకుంటూ, నమాజ్ చేస్తూ, రోజా ఉంటూ గడుపుతున్నాను. నేను చదివిన హదీసులు 1. సహీ బుఖారి (9 వాల్యూమ్‌లు), 2. అబుదావూద్ 3. తిర్మిజి 4. సహి ముస్లీమ్ మరియు మహమ్మద్ ప్రవక్త జీవిత చరిత్ర (సరాతున్నబి), వారి శిష్యుల ఖలీఫాల చరిత్రలు చదివాను. కానీ హదీసులు కొన్ని విషయాలలో ఒక దానిలో చెప్పిన దానికి, మరొక దానికి వ్యతిరేఖంగా ఉండేవి. నమాజ్ విధానము ఒక హదీసు వేరొక హదీసు చెప్పే విధానానికి వ్యతిరేఖంగా ఉండేది. జైల్లో కూడా నాలుగు, ఐదు (ఫిర్కే) వర్గాల వారు ఉన్నారు. మొత్తం ముస్లీమ్ సమాజము 73 వర్గాలుగా ఉన్నారని, 73వ వర్గం ఒకటి మాత్రమే జన్నత్ (స్వర్గం) లోకి వెళ్ళుతుందని చెప్పేవారు. 73 వర్గాలలో ఆ ఒక్కటి ఏది అంటే అందరూ మాది మాది మాత్రమే జన్నత్‌లోనికి వెళ్ళుతుంది. మిగతావర్గాలవారు వెళ్ళరు అనేవారు. ఏ వర్గము జన్నత్‌లో వెళ్ళదని నమ్మకము, రుజువు ఏమిటి అంటే ప్రళయ దినము అల్లాహ్ వద్దకు వెళ్ళిన తరువాత తెలుస్తుంది గాని ఇప్పుడు చెప్పలేము, ఎవరికీ తెలియదు అని చెపుతున్నారు. నమాజ్ చేసుకుంటూ, రోజా ఉంటూ, బోధలు వింటూ ఉంటే, పాపాలన్నీ క్షమించబడి స్వర్గంలోకి వెళ్ళుతాము అని చెప్పేవారు. జ్ఞానం గురించి ఎంత తెలుసుకుంటుంటే, హదీసులు చదువుతున్నప్పుడు ప్రశ్నలు, సందేహాలు ఉంటుంటే పెరుగుతూ

ఉన్నాయి గానీ స్పష్టమైన సమాధానము దొరకడము లేదు. తెలిసినవారని పెద్దలని అడిగితే వారు చెప్పే సమాధానము అసంపూర్తిగా ఉండేది. ఒకరు చెప్పేదానికి మరొకరు చెప్పేదానికి పొంతన లేకుండా ఉండేది.

ఇలా నా జీవితం సాగుతుండగా 2016 సం॥ సెప్టెంబర్ నెలలో నేనున్న రూమ్ (బ్యారక్) కు అమీర్ అలి అనే వ్యక్తి వచ్చాడు. అతను ఎప్పుడూ ఏదో చదువుతూ, రాసుకుంటూ ఉండేవాడు, ఎవరితో ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. నాకు 2016 సం॥ నవంబర్ నెలలో విపరీతమైన బ్యాక్‌పెయిన్ వచ్చి చాలా బాధపడుతూ ఉన్నాను. అప్పుడు నాకు వేరే వారి ద్వారా అమీర్ అలికి చూపించు, అతను ఏదో ట్రీట్‌మెంట్ చేస్తాడట అని తెలిసి అతనికి నా ప్రాబ్లమ్ గురించి చెప్పాను. అప్పుడు అతను నన్ను చెక్ చేసి ఏదో పాయింట్ల పైవత్తి ట్రీట్‌మెంట్ చేశాడు. అప్పుడు వెంటనే నొప్పి తగ్గి రిలీఫ్ అయింది. దానితో వారితో పరిచయము పెరిగి జ్ఞానము గురించి అడగడము జరిగింది. అప్పుడు ఆయన జ్ఞానము గురించి తెలుసుకోవాలని ఉంటే వచ్చి కూర్చోండి చర్చిద్దాము అని అన్నాడు. అప్పటి నుండి (2016 డిసెంబర్ నుండి) ప్రతి రోజు సాయంత్రము లాకప్ తరువాత 7 గంటల నుండి 9 గంటల వరకు, నాకున్న డౌట్స్‌కి ఖుర్ఆన్ ఆయత్‌ల ద్వారా చూపించి వివరించేవారు. ఒక నెల రోజులలో నా సందేహాలకు చాలా జవాబులు దొరికేవి. అంతేకాక ఎన్నో తెలియని రహస్యాలు కూడా తెలియజెప్పేవారు. ఖుర్ఆన్‌లో శరీరము గురించిన ఆయత్‌లు ఇలా ఉన్నాయని, అల్లాహ్ విధానము ఇలా ఉంది అని వివరించేవారు. ఇప్పటి వరకు ఎవరూ చెప్పనివి, ఎవరికీ తెలియనివి చెప్పుతూవుంటే మొత్తం సత్యము, నిజమైనదని అనిపించింది. అప్పుడు ఇంకా ఎక్కువ జ్ఞాన విషయాలు తెలుసుకోవాలని పగలు కూడా జ్ఞానము గురించి చెప్పమని అడిగినాను.

అప్పుడు ఆయన సురా 3-7 ఆయత్‌ను చూపించి ఖుర్‌ఆన్‌లో ముహ్కమాత్ మరియు ముతషాబిహాత్ (స్థూల,సూక్ష్మ) ఆయత్‌లు ఉన్నాయి, ఇవి ఇప్పటి వరకు ముస్లీమ్‌లకు తెలియక ఖుర్‌ఆన్ మొత్తము ఆయత్‌లను స్థూలముగా రాసుకున్నారు. అందుకే ఖుర్‌ఆన్ ఎవరికీ సరిగా అర్థము కాక, ఎవరికి అర్థమైనది వారు హదీసుల రూపములో రాసుకొని, 72 వర్గాలుగా చీలిపోయారు. ఈ సూక్ష్మ ఖుర్‌ఆన్ ఆయతులను ప్రబోధానంద యోగీశ్వరులు అనే ఒక స్వామివారు వీటి గురించి వివరణ గ్రంథములో వ్రాశారు. వారి ద్వారానే నాకు ఈ జ్ఞానం దొరికిందని, వారు మూడు మతాల జ్ఞానం చెబుతారు, చాలా గ్రంథాలు వ్రాశారు. నీకు శ్రద్ధవుంటే జ్ఞానం తెలుసుకోవాలని అనిపిస్తే, నీకు స్వామివారు రాసిన గ్రంథాలు నా దగ్గర ఉన్నాయి. చదువుతానంటే ఇస్తాను అవి తెలుగు మరియు కన్నడ భాషలలోనే ఉన్నాయి. కొన్ని ఉర్దూలో ఉన్నాయి అని చెప్పారు. అప్పుడు నేను నాకు కన్నడ భాష వస్తుందని చెప్పాను. అప్పుడు నాకు మొదటిసారిగా 2017 సం॥ జనవరిలో **"ధర్మశాస్త్రం ఏది (ధర్మశాస్త యావదు)"** అనే గ్రంథము ఇచ్చారు. అప్పటి వరకు నాకు ధర్మం అంటే, శాస్త్రము అంటే కూడా ఏమీ తెలియదు. కానీ ఈ గ్రంథము చదివిన తరువాత ధర్మము, శాస్త్రము అంటే ఏమిటో తెలిసింది. అంతేకాక చాలా జ్ఞాన విషయాలు తెలిసినాయి. అన్నీ నిజాలుగా అర్థము అయ్యాయి. మిగతా గ్రంథాలు కూడా చదవాలని శ్రద్ధ పెరిగింది. నేను 2017 సం॥ జనవరి నుండి 2018 సం॥ ఏప్రిల్ వరకు చదివిన మొత్తం గ్రంథాలు 1. ధర్మశాస్త్రం ఏది? 2. ప్రవక్తలు ఎవరు? 3. కర్మపత్రం 4. ఒక మాట మూడు గ్రంథాలు 5. దేవుని తీర్పు (జడ్జిమెంట్ ఆఫ్ గాడ్) 6. మూడు గ్రంథములు ఇద్దరు గురువులు ఒక బోధకుడు 7. ఒక్కడే ఇద్దరు 8. దేవుని రాకకు ఇది సమయము కాదా? 9.ఏసు చంపబడ్డాడా? చనిపోయాడా? 10. త్రైతాకార

రహస్యం 11. నీకు నాలేఖ 12. గీతా పరిచయం 13. సాయిబాబా దేవుడా కాదా? 14. మంత్రం–మహిమ 15. దేవాలయ రహస్యాలు 16. ఇందూ సాంప్రదాయాలు 17. దయ్యాల–భూతాల యధార్థ సంఘటనలు 18. 1058 ఆధ్యాత్మిక ప్రశ్నలు–జవాబులు 19. భగవద్గీత 20. స్వర్గం ఇంద్రలోకమా! నరకం యమలోకమా? 21. దేవుని చిహ్నం 22. ఏది నిజమైన జ్ఞానం 23. మరణం తరువాత జీవితం 24. జనన మరణ సిద్ధాంతం 25. పునర్జన్మ రహస్యం 26. సమాధి 27. విశ్వవిద్యాలయం 28. సుబోధ 29. శ్రీకృష్ణుడు దేవుడా భగవంతుడా? 30. హిందూమతంలో సిద్ధాంతకర్తలు 31. ధ్యానం–ప్రార్థన–నమాజ్ 32. సామెతల జ్ఞానం 33. హేతువాద ప్రశ్నలు–సత్యవాద జవాబులు 34. హిందూమతంలో కుల వివక్ష 35. శిలువ దేవుడా? 36. వార్తకుడు–వర్తకుడు 37. ప్రబోధ 38. మన పండుగలు 39. తల్లి తండ్రి 40. త్రైతారాధన 41. భగవాన్ రావణ బ్రహ్మ 42. ఒక వ్యక్తి రెండు కోణములు 43. ప్రథమ దైవ గ్రంథం భగవద్గీత 44. మతం పథం 45. అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు, రెండవది వజ్ర వాక్యములు మరియు 46. ద్వితీయ గ్రంథము బైబల్ కూడా తెలుగులోవి ఉర్దూలో ట్రాన్స్‌లేషన్ చేసి ప్రతిరోజు రెండు గంటలు చెప్పేవారు. మిగతా గ్రంథాలలో ఉన్న డౌట్స్ కూడా అమీర్ అలితో అడిగి తెలుసుకొనేవాడిని.

పైన తెలిపిన గ్రంథాలు ఒక్కొక్క గ్రంథము చదువుతూ ఉంటే నాకు ప్రతి ఒక్క గ్రంథములో తెలియబడే జ్ఞానముతో ఆనందముతో క్రొత్త అనుభూతులు పొందుతూ నా హృదయం పులకించిపోయేది. నా గత జీవితములో ఉన్న కోపం తగ్గిపోయింది, సహనము పెరిగింది. నాలో ఊహించని మార్పు వచ్చింది. నాకు తమరి జ్ఞానము ద్వారా కొత్త జన్మ (అంటే బిందు పుత్రునినుండి నాద పుత్రుని జన్మ) ప్రసాదించబడిందని ఆనందముగా ఉన్నాను.

సాక్షాత్తూ ఖుదా చెప్పిన జ్ఞానము ద్వారా తెలియబడిన నిగూఢ రహస్య నిజాలు ఏమనగా మూడు ఆత్మల జ్ఞానం (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ) మూడు గ్రంథాలలో ఉన్నదని భగవద్గీత 14-16, 17 శ్లోకాలు బైబిల్ మత్తయి సువార్త 28-19 వాక్యము, ఖుర్ఆన్‌లో 50-21 ఆయతుల ద్వారా తెలిసింది. మూడు దైవ గ్రంథాలలో చెప్పబడిన జ్ఞానము దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే, దేవున్ని చేరవలసిన గమ్యము కూడా ఒక్కటే అనే విషయము తెలిసిపోయింది. మతాలను మానవులు తయారు చేసుకున్నారని అర్థము అయింది.

నేను ముస్లీముగా నా బాధ్యత నమాజ్, రోజా, జకాత్, హజ్ చేసి, హదీసులలో తెలిపిన ప్రవక్త ఆదేశాలను (సున్నత్‌లను) ఆచరిస్తే నేను నిజమైన ముస్లీముగా మారి జన్నత్ (స్వర్గం)లో చేరిపోతానని నమ్మినాను. కానీ ఖుదా రాసిన గ్రంథాలు చదివిన తరువాత నిజమైన జ్ఞానము తెలిసిన తరువాత, అసలు నిజమైన ముస్లీమ్ ఎవరో తెలిసిపోయింది. నిజమైన నమాజ్, జకాత్, రోజా, హజ్, అల్లాహ్ సృష్ఠిఆదిలో ఉన్న పేర్లు అని వాటి గురించి వివరణ చదినిన నాకు ఏదో రహస్య నిధి (దైవనిధి) దొరికినంత ఆనందం కల్గినది. జన్నత్ దోజఖ్ (స్వర్గం, నరకం) అంటే ఏమిటి? మోక్షం (ఆఖిరత్) అంటే ఏమిటి? అవి ఎక్కడ ఉన్నాయి? ఎలా ఉన్నాయి? అనే విషయము తెలిసింది. మా ముస్లీములకు తెలియని మోక్షం (ఆఖిరత్, నజాత్) కూడా ఉన్నదని స్వామి వారి గ్రంథముల జ్ఞానము ద్వారా తెలిసి ఆనందభరితుడైనాను.

తౌరాత్ అంటే భగవద్గీత అని ప్రపంచానికే తెలియని గొప్ప రహస్య జ్ఞానము చెప్పిన ప్రపంచములోనే మొదటి వ్యక్తిగా కీర్తికెక్కినారు. ఖుర్ఆన్‌లో తౌరాత్ అంటే ఏమిటో 5-44, 46, 48, 68 మరియు 62-5 ఆయతుల ద్వారా రుజువు చేసినారు. ఖుర్ఆన్‌లో 25-1, 2-53, 8-8 ప్రకారం

www.thraithashakam.org

ఫుర్ఖాన్ (గీటురాయి) మహమ్మద్ ప్రవక్తకు ఇచ్చిన గీటురాయి, మూసాకు ఇచ్చిన గీటురాయి (ఫుర్ఖాన్) ఒక్కటే అని, ఆ ఆయత్‌ల ద్వారా తౌరాత్ (భగవద్గీత) లో ఉన్న జ్ఞానము, ఖుర్ఆన్‌లో ఉన్న జ్ఞానం ఒక్కటేనని మరియు తౌరాత్ ఖుర్ఆన్‌కు మాతృ గ్రంథము (ఉమ్ముల్ కితాబ్) అని, బైబిల్ కూడా భగవద్గీతలో భాగమేనని పరమ రహస్యం తెలిసింది. మూడు గ్రంథములు ఒకే దైవము గురించి, మూడు ఆత్మల గురించి చెప్పినవని జీవాత్మలమైన మాకు ముక్తిని ప్రసాదించేవే మూడు గ్రంథాలు అని స్వామి వారి జ్ఞానము ద్వారా తెలిసింది.

తౌరాత్ (భగవద్గీత) లో చెప్పిన ప్రకారం ధర్మములు, అధర్మములు అంటే ఏమిటి, ధర్మాలు (బ్రహ్మ, కర్మ, భక్తి యోగాలు) ఆచరిస్తే మోక్షం వస్తుందని, అధర్మాలు (దానాలు, వేదాలు, యజ్ఞములు, తపస్సులు) ఆచరిస్తే పాప, పుణ్యకర్మలు అంటుకొని జన్మలు కలుగుతాయని తెలిసింది. ధర్మములు తెలిసి ఆచరిస్తే మోక్షం ప్రాప్తిస్తుంది అని, ఈ విషయమే ఖురాన్‌లో ఉందని తెలిసినది.

భగవద్గీతయే తౌరాత్ గ్రంథము అని, తౌరాత్ పేరుతో గ్రంథము ఎక్కడా లేదని బైబిల్‌లో మోషేకు, ఖుర్ఆన్‌లో మూసాకు ఇవ్వబడినదే భగవద్గీత గ్రంథము అని ఖురాన్ 6-91 ఆయత్ ద్వారా తెలిసింది. సృష్ఠి ఆదిలో దేవుని జ్ఞానము భగవద్గీత శ్లోకం 4-1 ద్వారా పరమాత్మ మొదట సూర్యునికి చెప్పాడు అని, సూర్యుడు మనువుకు చెప్పాడని, మనువు ద్వారా ఇక్ష్వాకుడు అను రాజుకు తెలియబడినది అని, అదే జ్ఞానం (జపర జ్ఞానం) 5000 సం॥ల క్రితం అర్జునుడికి శ్రీకృష్ణ భగవాన్ చెప్పారని, శ్రీకృష్ణ భగవానే మోషే (మూసా) కు స్వప్నంలో భగవద్గీత గ్రంథాన్ని తౌరాత్ పేరుతో ఇచ్చారని తరువాత శ్రీకృష్ణ భగవానే ఏసుప్రభువుగా వచ్చి బైబిల్ (ఇంజిల్) జ్ఞానము చెప్పినారు అని తరువాత సూర్యుడే పేరు మార్చుకొని జిబ్రయిల్‌గా తెర

www.thraithashakam.org

చాటు నుండి మహమ్మద్ ప్రవక్తకు చెప్పినారు అని తమరి గ్రంథాల ద్వారా తెలిసింది. ఎవరికీ తెలియని పరమ రహస్యాలు తెలిసి ఆనందభరితుడైనాను.

తౌరాత్ (భగవద్గీత) ప్రకారం నాకు తెలిసిన నిగూఢ జ్ఞానము సృష్టి ఆదిలో పరమాత్మ నాలుగు భాగాలు (ప్రకృతి, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ) గా విభజింపబడినాడు అని, ప్రకృతి అనేది చర, అచర ప్రకృతిగా రెండు భాగాలుగా మారిందని, చర ప్రకృతిగా 24 భాగాల శరీరం, అందులో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు కలిపి 27 భాగాలు అని, ప్రకృతియే మాయగా గుణాల రూపంలో (సైతాన్) తలలో ఉంది అని, బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రాలు మనిషి కర్మలు అనుభవించడానికి మూలము అని, జీవాత్మ అయిన నేను గుణచక్రములో రవ్వంతగా ఉన్నానని, ఆత్మ శరీరము అంతా వ్యాపించి ఉంది అని, పరమాత్మ శరీరము లోపల, బయట అణువు అణువు వ్యాపించి ఉందని, ఖురాన్ 6-95 ఆయత్ ప్రకారం జీవాత్మల జన్మలు మూడు విధాలు అండజ, పిండజ, ఉద్భిజాలుగా ఉన్నాయని, కర్మలు మూడు విధాలు ప్రారబ్ద, ఆగామిక, సంచిత కర్మలని, మరణాలు కూడా (మూడు +ఒకటి) నాలుగు అని కాల, అకాల, తాత్కాలిక, ఆఖరి మరణములు అని అద్భుతమైన అగోచర జ్ఞానము తెలిసినది.

నేను జీవాత్మనని, పరమాత్మ అంశనని, కర్మ బంధములో చిక్కుకొని ప్రకృతి చేతిలో ఉన్నానని, కర్మలు నాశనం చేసుకుంటేనే జన్మ, కర్మ బంధాల నుండి ముక్తి కలుగుతుందని, ముక్తి కలగాలంటే భగవద్గీతలో భగవానుడు చెప్పిన ధర్మాలు బ్రహ్మ, కర్మ, భక్తి యోగాలు ద్వారానే మోక్షం ప్రాప్తిస్తుంది అని తెలిసినది. 1. బ్రహ్మయోగం మనసును నియంత్రించడం అని 2. కర్మయోగం అహము (అహంభావం) లేకుండా, నేనే కార్యములు చేస్తున్నాననే భావం లేకుండా కార్యములు చేయడం అని 3. భక్తియోగం

ధర్మముల ప్రచారము, దైవసేవ అని ఈ మూడింటి ద్వారానే కర్మలు నాశనం చేసుకొని, జన్మలు లేకుండా చేసుకొని మోక్షం పొందాలని తెలిసింది.

సూక్ష్మములో మోక్షం అంటే భగవంతుడిని తెలిసి సాకారాన్ని ఆరాధించడము భగవద్గీత శ్లోకాలు, 4-9, మరియు 18-66 ద్వారా తెలిసినాయి. శిశువు జన్మించిన తరువాత మొదటి శ్వాసలో జీవాత్మ ప్రవేశించిన తరువాతనే ప్రాణం వస్తుందని, మనిషికి స్థూల, సూక్ష్మ రెండు శరీరములు ఉన్నవని అలాగే స్థూల, సూక్ష్మ కర్మలు కూడా రెండు రకములు అని, దయ్యాలు, భూతాలు గురించి రహస్యాలు తెలిసినాయి. బ్రహ్మవిద్య శాస్త్రం ఆధ్యాత్మిక జ్ఞాననిధి అని తెలిసిపోయినది. మనిషి శరీరములోని బ్రహ్మనాడిలోనే, విశ్వము ఇమిడి ఉన్నదని, షట్ శాస్త్రములు, సర్వవిద్యలు, బయటి సమస్త ప్రపంచము, ప్రపంచాన్ని సృష్టించిన దేవుడు, మోక్షప్రాప్తి కూడా, సర్వము బ్రహ్మనాడిలో ఇమిడి ఉన్నాయనే నిజము తెలిసింది.

ఖుర్ఆన్ మరియు ముస్లీమ్‌ల విషయములో వారు అజ్ఞానముతో, అపోహలతో, భ్రమలతో ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానాన్ని ఎలా తప్పుడు భావము చెప్పుకుంటున్నారో, తమరి జ్ఞాన గ్రంథాల ద్వారా నిజాలు తెలిసి విస్మయం, ఆశ్చర్యం కల్గినది. ఖుర్ఆన్‌లో దాగి ఉన్న రత్నాలు, ముత్యాలను సాధారణ రాళ్ళుగా భావించిన మా ముస్లీమ్‌లకు పంచి పెట్టిన జ్ఞాన ప్రదాతగా మీకు నా సాష్టాంగ సుమాంజలులు తెల్పుతున్నాను.

సురా 3 ఆయత్ 7 ద్వారా ఖురాన్‌లో ముహ్కామాత్ (స్థూల), ముతషాబిహాత్ (సూక్ష్మ) ఆయత్‌లు ఉన్నాయని, శరీరములో దాగివున్న సూక్ష్మజ్ఞానం గురించి తెలియని జ్ఞానాన్ని **అంతిమ గ్రంథములో, జ్ఞాన వాక్యాలు, వజ్ర వాక్యాలు** అనే రెండు జ్ఞాన గనులను మా ముస్లీమ్

సమాజానికి అందించిన తమరి రుణం తీర్చుకోలేనిది. మొత్తము ముస్లీమ్ సమాజానికే తెలియని అగోచర జ్ఞానాన్ని తెలిపిన ఖుదాకు (అల్లాహ్ జ్ఞానము అల్లాహ్‌కు తప్ప ఎవరికీ తెలియదు) భగవంతునికి, ఆదరణకర్తకు నా సజ్‌దా చేస్తున్నాను.

ఏడు ఆకాశాలు, భూమి వాటి మధ్య ఉన్న సమస్తము అంటే శరీరము అని 30-8, 11-123, 74-30,31 ఆయతుల ద్వారా, ముస్లీమ్‌లకు ఇంతవరకు తెలియని గొప్ప రహస్యం తెలిపినారు. శరీరము లోనే మూడు ఆత్మలు ఉన్నాయని ఖురాన్ ఆయత్ 50-21 ద్వారా **"తోలబడే వాడు జీవాత్మ, తోలేవాడు ఆత్మ, సాక్షిగా చూసేవాడు పరమాత్మ"** అని, ఇవి భగవద్గీతలో 14-16,17 మరియు బైబిల్‌లో మత్తయి సువార్తలో 28-19 నందు మూడు దైవగ్రంథాలలో ఉన్న విషయం ముస్లీమ్ సమాజానికి ఒక కనువిప్పుగా ఉన్నది. ముస్లీమ్‌లు ఆచరించే నమాజ్ తపస్సు అని, నిజమైన నమాజ్ శరీరములోనే ఉందని 4-103, 3-191 ఆయతుల ద్వారా తెలిసింది. జకాత్ అంటే వందరూపాయలకు 2.50 రూపాయలను బీదలకు పంచడము కాదని దైవసేవ, ధర్మ ప్రచారమని (భగవద్గీతలో చెప్పిన బ్రహ్మ,కర్మ,భక్తి యోగాలు అని) ఖురాన్ 48-15,16,17 ఆయతులని, రోజా అంటే అన్నం తినకుండా ఉండుట కాదని, ఖుర్‌ఆన్ 2-187 ఆ యత్ ద్వారా ఆత్మని పొందడము ఉపవాసమని తెలిసినది. హజ్‌లో చేసే ఆచరణ సఫా,మర్వా చర, అచర ప్రకృతికి గుర్తులు అని తెలియని రహస్యము తెలిసింది.

ముస్లీమ్‌లకు ఖుర్‌ఆన్‌లో సూక్ష్మ ఆయత్‌లు అర్థముకాక స్థూలముగా చెప్పుకొని మొత్తము ముస్లీము సమాజానికి ఖుర్‌ఆన్ దూరము చేసి ఆయత్ 2-79 ప్రకారం మనుషులు హదీసులను వ్రాసుకొని అవి మాత్రమే బోధిస్తూ

www.thraithashakam.org

మొత్తము ముస్లీమ్ సమాజాన్ని 72 వర్గాలుగా చీల్చి, ఖుర్ఆన్‌కు, అల్లాకు దూరం చేసి ఖుర్ఆన్ ఆయత్‌లు 2-159, 41-40 ప్రకారం అల్లాహ్ శాపానికి గురైనారు. స్వర్గమే జీవిత లక్ష్యముగా పెట్టుకున్నారు. ముస్లీములకు స్వర్గము, నరకము తప్ప, పరలోకము (మోక్షము) అంటే ఏమిటో అవి ఎక్కడ ఉంటాయో తెలియకున్నారు. ఆయత్‌లు 10-106, 107, 108 స్వర్గం, నరకం గురించి, 3-14, 6-127, 13-24, 30-7,8, 40-39, 40 పరలోకము గురించి ఖుర్ఆన్‌లో ఉన్నప్పటికీ, ముస్లీమ్ పెద్దలకు తెలియకపోవడము దురదృష్టకరము.

ముస్లీములకు పునర్జన్మలు ఉన్నాయని ఖుర్ఆన్ ఆయతులు 7-29, 22-66, 36-68, 40-11 చెప్పుతున్నాయి. గత జన్మలో చేసుకున్న కర్మలు అనుభవించడానికే జన్మలు ఉన్నాయని ఆయత్ 10-4 చెప్పుతుంది. ముస్లీములకు తబ్దీర్ (కర్మ) అంటే పూర్తిగా తెలియదు. ఆయత్ 9-51, 57-22 పుట్టుక ముందే అన్నీ రాయబడి ఉన్నాయంటే ఏమి వ్రాయబడి ఉన్నాయో తెలియక అయోమయములో ఉన్నారు. 7-187, 30-56 ప్రళయము గురించి, 9-5, 5-32 జీహాద్ గురించి, 72-6, 3-41 జిన్నాతుల గురించి, 40-40, 48-5 స్త్రీలకు స్వర్గము గురించి ఖురాన్‌లో స్పష్టముగా ఉన్నప్పటికీ తెలియకున్నారు.

97-1, 2, 3, 4, 5 ఖుర్ఆన్ ఆయత్‌ల ద్వారా సృష్ఠి రహస్యము తెలియబడింది. దానికి భిన్నముగా ముస్లీములు లైల తుల్ ఖద్రి అంటే రంజాన్ అవతరించిన రోజు అని చెప్పుకుంటూ అధర్మ ఆచరణ చేస్తున్నారు. తమరి గ్రంథముల జ్ఞానము ద్వారా నిజమైన ముస్లీముగా మారినాను. తమరికి సాష్టాంగ నమస్కారములు.

www.thraithashakam.org

# ముస్లీమ్ సమాజానికి నా విజ్ఞప్తి ఏమనగా!

మొత్తము ముస్లీమ్ సమాజము ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ చెప్పిన ఖుర్‌ఆన్‌లో ఉన్న సురా 3 ఆయత్ 7 ప్రకారం ముహ్కామాత్, ముతషాబిహాత్ అంటే స్థూలవాక్యములు, సూక్ష్మవాక్యములు అంటే ఏమిటో తెలియక అజ్ఞానముతో, ఖుర్‌ఆన్ ప్రవక్తకే అర్థమవుతుంది, మనకు అర్థము కాదని, ప్రవక్త జీవిత విధానమే మనము ఆచరించాలని ముస్లీము పెద్దలు, హదీసులు వ్రాసి వాటిని మాత్రమే బోధిస్తూ ఖుర్‌ఆన్ జ్ఞానానికి, అల్లాహ్‌కు మొత్తము ముస్లీమ్ సమాజాన్ని దూరము చేసి, తీరని అన్యాయము చేసి అల్లాహ్ శాపానికి గురైనారు (ఆయతులు 2-159, 41-40). ఖుర్‌ఆన్ ఆయత్ 6-91లో మీ పెద్దలకు తెలియని విషయాలు ఎన్నో తౌరాత్‌లో తెలియబడ్డా యని ఉంది. ఖుర్‌ఆన్ ఆయత్ 2-79 ప్రకారం మనుషులు వ్రాసిన హదీసులను వదలి, నిజమైన అల్లాహ్ భక్తులుగా, ఖుర్‌ఆన్ ఆయతు 51-56 ప్రకారము అల్లాహ్‌ను, నిజజ్ఞానం తెలిసి ఆరాధించుదాము. ముస్లీమ్ పెద్దలు వారికే ఖుర్‌ఆన్ ప్రకారము నిజ జ్ఞానము తెలియక తఖ్దీర్ గురించి, పునర్జన్మల గురించి, ప్రళయము గురించి, జీహాద్ గురించి, స్వర్గము, నరకము, మోక్షము గురించి, ముఖ్యముగా నమాజ్, జకాత్, రోజా, హజ్ గురించి అర్థముకాక తప్పు భావముతో హదీసులను వ్రాసి, ఖుర్‌ఆన్ జ్ఞానము తప్పు భావము చెప్పి, ముస్లీమ్ సమాజాన్ని 72 వర్గాలుగా చీల్చినారు. స్వర్గము పొందటమే జీవిత లక్ష్యముగా హదీసులు బోధిస్తున్నారు.

ముస్లీములారా! ఇప్పటికైనా మేల్కోండి. అల్లాహ్ మన కోసము ఖుర్‌ఆన్ ఆయత్ 2-186 ప్రకారం ఒక వ్యక్తిలో దైవశక్తి ద్వారా నిజమైన జ్ఞానాన్ని తెలియపరచడానికి పంపి మనలను నిజమైన ముస్లీములుగా,

సంపూర్ణ ముస్లీములుగా చేయటానికి పంపి, యోగీశ్వరుల వారి ద్వారా **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు, వజ్ర వాక్యములు"** అని ముస్లీము సమాజానికి తెలియని ఖుర్‌ఆన్ సూక్ష్మ ఆయతుల జ్ఞానాన్ని అల్లాహ్ ప్రేరణతో (సంకల్పముతో) మనకు రెండు గ్రంథాలను వాటికి అనుబంధ గ్రంథాలను వ్రాసి ఇచ్చారు. కాబట్టి స్వర్గానికి తీసుకువెళ్ళే హదీసులను వదలి, మోక్షానికి తీసుకువెళ్ళే ఖుర్‌ఆన్ ఆయత్ 40-39, 41 ను తీసుకొని ఆచరించి, 72 వర్గాలను వదలి నిజమైన అల్లాహ్ మార్గములోనికి రావాలని అందుకోసము యోగీశ్వరులవారి గ్రంథములను అసూయ లేకుండా చదివి, అర్థము చేసుకొని ఆచరించి నిజమైన 73వ అల్లాహ్ వర్గములోకి వచ్చి మోక్షము పొందుదాము (ఖుదా హాఫిజ్). ఖుదాకు మీ ప్రియ భక్తుడి విన్నపము. నాకు సంపూర్ణ జ్ఞానము ప్రసాదించమని, భగవద్గీత శ్లోకము 17-66 ప్రకారం శరణు వేడుకుంటున్నాను. నా జీవిత ధ్యేయము దైవ జ్ఞానము తెలుసుకుంటూ దైవసేవగా ధర్మప్రచారము చేసుకోవాలని నిశ్చయించుకొన్నాను. దానికి కావలసిన శక్తి సామర్థ్యాలను అనుగ్రహించ మని, మీ దర్శన భాగ్యము కల్పించమని, ఈ జ్ఞానము చెప్పింది. సాక్ష్యాత్తూ ఖుదా, భగవంతుడే, ఆదరణకర్తేనని సంపూర్ణముగా విశ్వసిస్తూ.... సాష్టాంగ నమస్కారము చేస్తున్నాను.

ఇట్లు మీ ప్రియ భక్తుడు

**సయ్యద్ సల్మాన్‌షా**



**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

www.thraithashakam.org

# ఖుర్ఆన్-హదీసులలో

# ఏది ముఖ్యము?



Author : The Only Guru of Three Religions
The Spiritual Emperor, Thraitha Theorem Originator
Sri Acharya Prabodhananda Yogeeshwarulu

www.thraithashakam.org